# ఆత్మషట్కము-2

## (శ్రీ శంకరాచార్యులవారు)

శ్లో॥ రజ్జ్వజ్ఞానాద్భాతి రజ్జౌ యథాఽహిః
స్వాత్మాజ్ఞానాదాత్మనో జీవభావః
ఆప్తోక్త్యాఽహిభ్రాన్తినాశే స రజ్జుః
జీవో నాహం దేశికోక్త్యా శివోఽహమ్.

తా॥ త్రాడు అని తెలియకపోవుట వలన (చీకటిలో) త్రాటి యందు పాము ఎట్లు గోచరించునో, అట్లే తన ఆత్మను గూర్చిన జ్ఞానము లేకపోవుటవలన, జీవభావము కలుగుచున్నది. దీపము కలవాడు చెప్పిన దానినిబట్టి భ్రాంతి నశించిపోగా, పాము తొలగి పోయి త్రాడే మిగులునట్లు, గురుబోధచేత 'నేను జీవుడను కాను శివస్వరూపుడగు ఆత్మనే' అని తెలిసికొంటిని.

*వ్యాఖ్య :—సామాన్యముగ జనులు చీకటిలో త్రాడును చూచి పాము అని భ్రమించుచుందురు. తత్ఫలితంగా వారికి భయము, గుండెదడ మొదలైన వికారములు కలుగును. కాని దీపపు కాంతిలో చూడగా అది త్రాడేకాని పాము కాదని ఎపుడు తెలియునో, అపుడు భ్రాంతి తొలగిపోయి, వికారములు శమించును. శాంతి చేకూరును. అట్లే గురూప దేశముచేత తాను వాస్తవముగ జీవుడు కాదనియు, సచ్చి దానంద ఆత్మయే యనియు తెలిసికొనినపుడు జీవుడు దుఃఖరహితుడై పరమానందమును, ఆత్యంతికశాంతిని





సంపుటము : 25 జూన్ 1993 సంచిక 6


## సంపాదకవర్గము

గౌరవ సంపాదకులు :

డా॥ రావుల సూర్యనారాయణమూర్తి M A.,D Litt. శ్రీ సముద్రాల లక్ష్మణయ్య M A.

సంపాదకులు : బి. ఈశ్వర్

సహాయ సంపాదకులు : బోధచైతన్య, M A. ఓంప్రకాశ్ B Sc

**సంవత్సర చందా : రూ. 30/-లు**

పంపవలసిన అడ్రసు : మేనేజరు, వేదాంతభేరి కార్యాలయము
అనిల్ బిల్డింగ్స్, సూర్యారావుపేట
పి.బి.నెం.323, విజయవాడ-520 002
ఫోన్స్ : 61862, 64017, 72433
Telex 0475 362 ANIL Fax : 0866-63017

**శాశ్వత చందా : రూ. 300/-లు.**

పంపవలసిన అడ్రసు : 'వేదాంతభేరి శాశ్వతనిధి'
శ్రీ శుకబ్రహ్మాశ్రమము, శ్రీ శుకబ్రహ్మాశ్రమము
పోస్టు, శ్రీకాళహస్తి-517 640
ఫోన్స్: 2239,2543 STD Code 085 78

(చందాదారులు ఉత్తర ప్రత్యుత్తరములలో తమ చందా సం|| తప్పక ఉదహరించవలెను. చందా నంబరు మీకు పోస్టులో పంపు 'వేదాంతభేరి' కవరుపైయుండును.)



**అనుష్ఠాన వేదాంతమును బోధించు ఆధ్యాత్మిక మాసపత్రిక**



**భారతీయ ఆధ్యాత్మిక ఔన్నత్య కాంతిని ప్రపంచమంతా ప్రకాశింపజేసిన జ్ఞానభాస్కరుడు, 'నిర్భయత్వమతా'న్ని చాటిచెప్పిన సత్యసాహసి, భక్తి జ్ఞాన కర్మ యోగాలను అనుష్ఠించిన మహాత్యాగి శ్రీ వివేకానందస్వామి.**

# దైవ ప్రార్థన

## (పరశురామావతారము—6)

అథ క్షత్రియాసృక్ ప్రపాన ప్రమత్తః
ప్రణత్యత్ పితా చ ప్రగీత ప్రతాపః
ధరాకారి యేనాగ్ర జన్మాగ్రహారో
విహారం క్రియాన్మాన సే వః స రామః

*క్షత్రియుల శక్తిని అణచివేసి, తండ్రికి ప్రణామమాచరించిన వారును, భూతలమును మహనీయులకు ఆలవాలముగ నొనర్చి కీర్తిని వహించిన వారునగు పరశురాముడు జనుల మనంబున విహరించి కాపాడుగాక! పరశురామ స్వరూపుడైన అట్టి పరమాత్మకు నమస్కారము.*

ఓం

Disciple - Sir when shall I be free?
Master - When 'I' shall cease to be.
శిష్యుడు — మహాత్మా! నే నెప్పుడు మోక్షమును పొందుదును.
గురువు — 'నేను' అనునది తొలగిపోయినపుడు (అహంభావము తొలగినపుడు).

# శంఖారావము



**Y**oung men with burning patriotism and renunciation are needed. None can master a thing perfectly in so short a time as the Tyagi's will.

అఖండ దేశభక్తి, తీవ్రవైరాగ్యము, అనుపమ త్యాగబుద్ధి కలిగిన యువకులు కావలయును. త్యాగశీలురు ఏ విషయమునైనను కొద్దికాలములోనే క్షుణ్ణముగ తెలిసికొనగలరు. అట్టి శక్తి ఇతరులకు వుండదు. OO

He who adjourns God-thinking to a further date is a postdated cheque with no signature.

దైవధ్యానమును భావికాలమునకు వాయిదా వేయువాడు ముందు తేదీ వేయబడియున్న చేవ్రాలులేని (బ్యాంకు) చెక్కువంటివాడు.

(అది ఎపుడును చెల్లదు. కాబట్టి ఎపుడో మున్ముందు దైవధ్యానము చేసెదమను భావన మార్చుకొని ఈ క్షణమునుండియే దైవచింతనము గావించుచుండుట శ్రేయస్కరము.)

---



# అంతర్యుద్ధము

## శ్రీ విద్యాప్రకాశానందగిరిస్వాములవారు



రామ రావణ యుద్ధము కొద్ది దినములు జరిగిన పిదప నిలిచిపోయెను. పాండవ కౌరవ యుద్ధము పదునెనిమిది దినములు మాత్రము జరిగి ఆగిపోయెను. ఏ యుద్ధమైనను కొంతకాలము జరిగిన పిమ్మట విరమణమొందుచుండును. కాని జీవుని హృదయమున చెలరేగు యుద్ధము మాత్రము అవిరళముగ కొనసాగుచునే యున్నది. ఇప్పటికి ఎన్ని కోట్ల జన్మలో గడచిపోయినవి. యుద్ధము అంతరించ లేదు. ధర్మమునకు అధర్మమునకు, న్యాయమునకు అన్యాయమునకు, దైవసంపదకు అసుర సంపదకు, సత్యమునకు అసత్యమునకు, ఆత్మకు అనాత్మకు, దృక్కునకు దృశ్యమునకు, పురుషునకు ప్రకృతికి హోరాహోరి సంగ్రామము జీవునిలో కలుగుచున్నది.

మాయ (ప్రకృతి, అవిద్య) తన బలమును కూడగట్టుకొని, జీవునిపై విజృంభించుచున్నది. కామ క్రోధాది అరిషడ్వర్గమును, దంభ అసూయాద్వేషాది దుర్వృత్తులను జేరబిలుచుకొని తన పక్షమును అది బహుకాలమునుండి పదిలపఱచుకొని జీవునితో ముఖాముఖి యుద్ధము

నకు దిగినది. ఇట్టి పరిస్థితిలో జీవుడు తటస్థుడుగా నున్నచో ఘోర ప్రమాదము సంభవించగలదు. తానుగూడ తగిన బలమును చేకూర్చు కొని తనయంతశ్శత్రువులతో పోరునకు దిగవలెను.

దుర్బలత్వమును ప్రదర్శింపరాదు. వెన్ను చూపరాదు. దైవసంపద యను ఆయుధములను చేబూని రణరంగమున దుమికి శత్రువులు కాలికి బుద్ధి చెప్పునట్లు చూడవలెను ఇంతవఱకెన్ని జన్మలనుండియో జీవుడు చేసిన అశ్రద్ధవలననే శత్రువునకు కాలు నిలద్రొక్కుకొనుటకు చక్కని అవకాశమేర్పడినది. ఇకమీదట అట్లు చేయరాదు.
అని శ్రీకృష్ణమూర్తి ఆనతిచ్చినట్లు శత్రువుయొక్క అంతుచూడవలెను ఈ మానవ జన్మలోనే.

కాని అట్లు చేయుచున్నారా జనులు అనునది ప్రశ్న. తీవ్ర ముముక్షుత్వముగల ఏ కొలదిమంది పుణ్యాత్ములోతప్ప తక్కినవారు శత్రువుల ఆ దాడి విషయమై అంతగా పట్టించుకొనుటలేదు. తత్ఫలితముగ నానా విధ దుఃఖయాతనలలో పడి, కామాది శత్రువులకు దాసానుదాసులై, అవి చెప్పినట్లు నడచుచు, అవి ఆడించునట్లు ఆడుచు వాటి మోచేతి నీటిని త్రాగుచు బానిసల వగిది వర్తించుచున్నారు. ఇది మానవులకు తగదు.

ఇట్లు చేయుట మానవత్వమునకే కళంకమాపాదించినట్లు. మా = అజ్ఞానము, న = లేకుండ, వ = వర్తించువాడు మానవుడు– అని గుర్తుంచుకొనవలెను.

కావున అజాగ్రత పనికిరాదు. ప్రమత్తత, సోమరితనము మృత్యువుతో సమానమని సనత్సుజాతుడు వచించియుండెను. (ప్రమాదో మృత్యురిత్యాహ భగవాన్ బ్రహ్మణస్సుతః) దీపమారినచో అంధకారమావరించగలదు. కావున ప్రజ్ఞయను దీపశిఖ ఆరకుండ చూడవలెను. వార్ధక్యము రాకపూర్వమే, బలజవసత్వములు సన్నగిల్లకముందే, ఆయువు పదిలముగ నున్నపుడే. ఆరోగ్యము స్థిమితముగనున్న కాలముననే అంతశ్శత్రువుల పని పట్టించవలెను. నా హృదయ గేహమును వదలిపొండు (Quit my heart) అని వానికి తుది హెచ్చరిక ఇవ్వవలెను.

అయితే పై పై హెచ్చరికలు చేసినా అవి ఒక రాగాన జీవుని వదిలి పెట్టవనుట నగ్నసత్యము. కావున క్రియారంగమునకు దిగవలెను. మాటలను చేష్టలుగా రూపొందించవలెను. నిర్భయత్వము *(Fearlessness)* అను ఆయుధమును చేబూని గీతయందు చెప్పబడిన అద్వేష్టృత్వాది, అమాని త్వాది సద్గుణరూప అస్త్ర శస్త్రములను ధరించి కామాది శత్రువులతో తలపడవలెను. ధైర్యము, పవిత్రత, పట్టుదల, సహనము, భగవద్భక్తి, వివేకము కలవాడు ఈ యుద్ధమున తప్పక విజయమును పొందగలడు. 'కశ్చిద్ధీరః ప్రత్యగాత్మనమైక్షత్'– ఏ ఒకానొక ధీరుడో యుద్ధమున విజయ మొంది ప్రత్యగాత్మను సాక్షాత్కరించుకొనగలడు– అని ఉపనిషత్తులు ఘోషించుచున్నవి. కాబట్టి అచంచల ధైర్యమే జీవుని పరమాయుధము.

ఎందఱో మహనీయులు, తపస్సంపన్నులు, పుణ్యాచరితులు తమ అప్రతిహత నిశ్చయాత్మ బుద్ధిచే ప్రకృతిని ఎదుర్కొని విజేతలై లోకమున పరిఢవిల్లిరి. వారి యాదర్శమును గైకొని ముముక్షువు వెనుక చూపులేక ముందునకే చనుచు ఈ ధర్మాధర్మ యుద్ధమున ఉత్తీర్ణుడై విజయ పతాకమును ప్రతిష్ఠించి ధన్యుడు కావలెను. జీవిత లక్ష్యమిదియేయని జ్ఞాపకమునందుంచుకొనవలెను. బాహ్యశత్రువులను జయించుటతో తృప్తి నొందక అంతశ్శత్రువులను కూడా జయించుటకు పూనుకొనవలెను. స్వరాజ్య ప్రాప్తితో తనివినొందక స్వారాజ్య ప్రాప్తిని కూడ బడయవలెను.

తాను మోక్ష సామ్రాజ్యాధిపతియగు ఆత్మయేకాని దేహాది దృశ్య పదార్థము కాదని ముమ్మాటికి నిశ్చయించి, అట్టి మహోన్నత నిశ్చయము ద్వారా హృదయమును ప్రకాశవంతముగ నొనర్చుకొనవలెను. చీకటిని ఆశ్రయించు రాక్షసులు ప్రకాశము చెంత నిలువజాలరు. జ్ఞానజ్యోతి చెంత దుర్వృత్తి రూప నిశాచరులు పలాయనము చిత్తగింతురు. ఇదియే శత్రు విజయము. ఈ ప్రకారముగ జీవుడు తన బుద్ధి కుశలత చేతను, కార్య దక్షతచేతను, సాధనాతిశయము చేతను తన అంతర్యుద్ధమున విజయము గాంచి మోక్షసామ్రాజ్యమునకు ఏకైక ప్రభువై విలసిల్లుచు మానవజన్మను సార్థకపఱచుకొనుగాక! ○○

*జూన్ 1993*

[illegible]

[illegible]

## శ్రీ నైనారు అప్పాస్వామి గారు (తిరుపతి)

1. వర్ష జలము కొండలనుండి పల్లమునకు
వడిగ ప్రవహించునటుల దైవకరుణయు
అహము గల్గిన మనుజుల నావల ద్రోసి
దీనులను జేరు దరిజేర్చ దివ్యముగను.

2. నేను, నాదను అహమును మానుకొనిన
స్వేచ్ఛ లభియించు నతనికి శీఘ్రముగను
అహము వీడి పరబ్రహ్మమందు జేర
కలుగు ముక్తి మహానందకరము గాగ.

3. నేనను తలపు అహమున నిలచియుండు
దాని దొలగింప కష్టంబు తనువు నుండి
కాన నద్దాని కనువుగ కళ్లెమేసి
దేవదేవుని సేవకు ద్రిప్పవలయు.

4. ప్రతి పనియు దైవ సంకల్ప బలము వలన
జరుగునని తలచు జనుడు జగమునందు
తాను దేవుని మరబొమ్మ తంత్రమనుచు
తనదు విధులను జేయుచు తనియుచుండు.

5. "నేను నేనను అహమును నిలువనీక
నీ మదిని నిర్మలముజేసి నిలచినపుడె
మహిత బ్రహ్మంబు దోచు సమాధియందు"
అని తెలుపు కరుణను జగదంబ నాకు.

## ధర్మం శరణం గచ్ఛామి

# సంఘరక్షితుని కథ

జేతవనంలో సంఘరక్షితుడనే భిక్షువు వుండేవాడు ఆయనంటే అందరికీ గౌరవభావం సంఘరక్షితుని పూర్వాశ్రమంలోని చెల్లెలు కూడా అన్నగారి మీద గౌరవ భావం చేత తనకు పుట్టిన మగబిడ్డకు సంఘరక్షితుడని పేరు పెట్టుకొంది అతను పెరిగి పెద్దవాడయ్యాక జేతవన విహారంలో చేరి భిక్షుదీక్ష తీసుకొన్నాడు ఇద్దరి పేర్లూ సంఘరక్షితులు కనుక గందరగోళం ఏర్పడకుండా వుండడానికి చిన్నవాణ్ణి సంఘ రక్షిత భాగినేయుడని పిలిచేవాళ్ళు (భాగినేయుడనగా సోదరి బిడ్డడు అని అర్థం).

ఒక వర్షరుతువు సమయంలో భాగినేయుడికి ఎవరో కానుకగా రెండు జతల మేలిమి వస్త్రాలను బహూకరించారు. అతడు ఒక జతను భద్రపరచి వర్షరుతువు అయిపోగానే సంఘరక్షితుని కుటీరానికి వెళ్లి ఆయనకు నమస్కరించి విసనకర్ర విసురుతూ తాను చాలా ఆప్యాయంగా పట్టుకొచ్చిన వస్త్రాలను స్వీకరించమని కోరాడు. "నాకు సరిపడే వస్త్రాలున్నాయి. వద్దు" అన్నాడు సంఘరక్షితుడు.

భాగినేయుడి అహం దెబ్బతినింది. తాను ఇంత ప్రేమగా తెచ్చి ఇస్తే గర్వంగా తిరస్కరించి నన్నవమానిస్తాడా? బదులుకు ఇతనికి అవమానం కలిగించాలి. ఎలా? నేను భిక్షు జీవితాన్ని వదలి గృహస్థుడినైతే అప్పుడు ఇతడు అవమానం పాలుకాక తప్పదుకదా! బైట పోతే ఈ రెండు జతల కొత్త వస్త్రాలకు సులభంగా రెండు మేకలు వస్తాయి. ఆ మేకలవల్ల కొన్నాళ్ళకు ఇంకా కొన్ని మేకలు పుట్టాయి. కుటుంబాన్ని పోషించగలిగే మేకలమంద ఏర్పడ్డాక పెండ్లి చేసుకొంటాను. సంవత్సరము తిరక్క ముందే పిల్లవాడు పుట్టాడు. వాణ్ణి తీసుకొని తాను, తన భార్య సంఘరక్షితుణ్ణి చూడ డానికి బండిమీద వస్తారు. తాను పిల్లవాణ్ణి ఒక చేత్తో పట్టుకొని మరో చేత్తో పగ్గాలు

పట్టుకొని బండిని నడుపుతాడు. బిడ్డను ఇటు ఇచ్చి బండిని సరిగా తోలండని భార్య బిడ్డను లాక్కుంటుంది. తాను కోపంతో మళ్లీ బిడ్డను లాక్కోబోతాడు. ఈ లాగు లాటలో బిడ్డ క్రింద పడి బండి చక్రం క్రింద నలిగిపోతాడు. తనకు పట్టరాని కోపం వచ్చి భార్యను జాటీ కట్టితో బాదుతాడు-

కాల్పనిక జగత్తులో విహరిస్తూ అంతదాక వచ్చిన భాగినేయుడు విసనకట్టను విసురుగా విసిరాడు. అది సంఘరక్షితుని తలకు తగిలింది. పరచిత్తజ్ఞానం అనే సిద్ధిని కలిగిన సంఘరక్షితుడు "పెళ్ళాన్ని దండించడం చేతగాక నన్ను కొట్టావేమిటి?" అని కొంత హాస్యస్వరంతో అన్నాడు. భాగినేయుడు అదిరిపోయి ఇక అక్కడ ముఖం చూపడం అవమానమనిపించి ఒకే పరుగుతో బైటకు పరుగెత్తాడు. అతనికన్నా వేగంగా పరుగెత్తగలిగిన యువక భిక్షువులు కొందరు అతణ్ణి వెంబడించి పట్టుకొని తిరిగి విహారానికి లాక్కొచ్చి బుద్ధుని ముందు నిలబెట్టారు.

బుద్ధుడు అతనికి ఉపదేశం చేస్తూ మనస్సు విషయంలో తీసుకొనవలసిన జాగ్రత్తలు కొన్ని చెప్పాడు. ముఖ్యంగా వికల్ప వృత్తులు తలెత్తకుండా చూసుకోవలసిన అవసరాన్ని నొక్కి చెప్పాడు. మనస్సు భవిష్యత్తుకు పరుగులు దీసి గాలిమేడలు కట్టుంది. లేదా గతానికి పరుగులు దీసి జరిగిపోయిన సంఘటనలను మరోవిధంగా జరిగినట్లుగా ఊహిస్తుంది.

ఇలాంటి వికల్ప వృత్తులవల్ల మనస్సు అలసిపోవడం, మానసిక శక్తి వృథా కావడం తప్పించి వేరే ప్రయోజనం కలుగదు. కనుక మనస్సు యొక్క కదలికల మీద సదా గమనిక కలిగివుండి దాన్ని వర్తమానంలోనే వుంచగలిగితే రాగద్వేషమోహాలనే సంసార బంధాలు తెగిపోతాయని చెప్పి క్రింది శ్లోకం పఠించాడు.

దూరంగమం ఏకచరం అశరీరం గుహాశయం
యే చిత్తం సంయమేస్సన్తి మోక్ఖన్తి మారబన్ధనా -ధర్మపదం 3-5

Carry the light and the life of Vedanta to every door.

**జ్ఞానప్రకాశమును సర్వత్ర వెదజల్లుడు. వేదాంత విజ్ఞానమును ఇంటింటికి వ్యాపింపజేయుడు.**



పావనగుణ రామా హరే । రామా హరే
పరమ దయా నిలయా హరే.
మాయా మానుషరూపా, మాయాతీతా మంగళదాతా.
వేదాంత వధూ హృదయ విహారా
వేదమయా పరమానంద రూపా.
కరుణారసభరనయనా । దరహాస మనోహరవదనా
నవతులసీదళ మాలాభరణా । నానాజీవన నాటక కారణా.
అయోధ్యవాసీ రామ్ । ఆత్మనివాసీ రామ్
దశరథనందన రామ్ । జయ జయ జానకిజీవనరామ్
అరణ్యవాసీ రామ్ । అహల్యామోచనరామ్
భక్తవత్సల రామ్ । జయ జయ భద్రగిరీశ రామ్
తాపసరంజన రామ్ । దానవభంజన రామ్
పశుపతిరంజన రామ్ । జయ జయ పాపవిమోచన రామ్.

3. హరేరామ హరేరామ । రామరామ హరేహరే
హరేకృష్ణ హరేకృష్ణ । కృష్ణకృష్ణ హరేహరే.
రామ రామ రామ సీత । రామ రామ రామ సీత.

4. పిబరే రామరసం రసనే
జననమరణభయశోక విదూరం
సకలశాస్త్ర నిగమాగమసారం
శుద్ధ పరమహంస ఆశ్రమగీతం
శుక శౌనక కౌశిక ముఖపీతం.

○○

# గీతావాహిని



## జ్ఞానఖడ్గము

సంశయ, మోహాదులన్నియు అజ్ఞానమునుండియే ప్రాదుర్భవించుచున్నవి. వానియన్నింటికి అజ్ఞానము తల్లివంటిది. సమస్త దుర్గుణములు, దుర్వాసనలు, దుస్సంకల్పములు, సంశయములు అచ్చోటనే పుట్టుచున్నవి. అజ్ఞానమును పారద్రోలుటయందు జ్ఞానమే సమర్థమగునుగాని తదితరములగు ఏ సాధనలున్నుగావు. కనుకనే అద్దానిని ఛేదించుటకు జ్ఞానమను ఖడ్గమును ప్రయోగించవలెను అంధకారమును బోగొట్టుటకు ప్రకాశమొకటియే సమర్థమగును గదా! అట్లే అజ్ఞానాంధకారమును నిర్మూలించుటయందు జ్ఞానప్రకాశముపయోగపడు చున్నది.

అనాదికాలమునుండి సంశయమోహాదులు హృదయముననే తిష్ఠవేసికొని యున్నవి. శత్రువు దూరమునలేడు అతిసమీపముననున్న హృదయముననే కలడు.

జ్ఞానప్రాప్త్యనంతరము లోకహితమునకై నిష్కామకర్మ యోగాచరణము నవలంబించవలెను. జ్ఞానికి కర్మను చేయుటయందుగాని, త్యజించుటయందుగాని పట్టుదల యేమియు లేకున్నను, ధర్మసముద్ధరణము కొఱకును, లోకసంగ్రహార్థమున్ను సామాన్యముగ నతడు నిష్కామబుద్ధితో కర్మ చేయుచునేయుండును. కనుకనే భగవానుడు గీతయందు అర్జునునికి ఈ ప్రకారముగ బోధించెను. 'ఓ అర్జునా! ముందు నీవు జ్ఞానమును సంపాదింపుము. అట్టి జ్ఞానఖడ్గముచే అవిద్యా హృదయ గ్రంథిని ఛేదించివేయుము. తదుపరి లోకరహితము కొఱకై కర్మను శీలింపుము'.

మహాత్ములగువారు నిద్రించు జనులను ధైర్యోద్యోతకములగు వాక్యములచే మేలుకొలుపుదురు. కూర్చొని మూలుగుచున్నవారికి ధైర్యప్రదానముచేసి కార్యరంగమున దుముకునట్లు చేయుదురు. గీతయందు అకర్మణ్యుడై రథమున చతికిలబడియున్న అర్జునునకు భగవానుడు ధైర్యమును నూరిపోసి 'ఉత్తిష్ఠ'- (లెమ్ము) అనుచున్నారు! కావున భగవానుని ఈ వాక్యమును సంస్మరించి తక్కినవారును అర్జునునివలె తమతమ హృదయములందు జన్మజన్మాంతరములనుండి గాఢముగ నాటుకొనియున్న అవిద్యాగ్రంథిని జ్ఞానఖడ్గముచే నఱకివైచి కర్తవ్యోన్ముఖులు కావలసియున్నారు. ఎన్ని సాధనలను అవలంబించినను తుట్టతుదకు ఆత్మజ్ఞానమొకటియే బంధవిముక్తికి శరణ్యము. ఆత్మజ్ఞానమును పొందిన పిదపయే నిష్కామ కర్మయోగమును ఇంకను చక్కగ శీలించుటకు అవకాశముయుండును. ○○

పవిత్రాత్మస్వరూపులారా! నిర్భయులైయుండుటకు వలయు సాధనము అను ఉపాయములను గురించి మీరెప్పుడైన ఆలోచించినారా? ఆలోచించనిచో ఇప్పుడైనను ఆ భయమను దుర్గుణమును పెకలించివేయుటకు తగు ప్రయత్న మాచరింపుడు ఏలననగా మీరు వాస్తవముగ మూర్తీభవించిన నిర్భయస్వరూపులు భయమనునది ఒక ప్రతికూల మనోవృత్తి. అది ద్వైతస్థితియందే వ్యక్తమగుచుండును.

భగవద్గీత 16వ అధ్యాయమందు (మఱియు 13వ అధ్యాయమందు) దైవీ సంపదను గూర్చి విస్తారముగ వర్ణించునపుడు మొట్టమొదటనే 'అభయం' (నిర్భయత్వము) అను అనుకూలమనోవృత్తియగు దైవికగుణము ప్రస్తావించబడెను. అవిద్య (అజ్ఞానము), అస్మిత (అహంభావము), రాగము (ఆసక్తి), ద్వేషము (ద్వేషభావము), అభినివేశము (ప్రాపంచిక విషయములందనురాగము)- అను ఈ ఐదింటిచే వేధింపబడునంతవఱకును మీరు అవర్ణనీయమగు పరమానందరూప నిర్భయస్థితిని అనుభవింపజాలరు

మఱియు స్వకీయ సచ్చిదానందస్వరూపమున నిలుకడను బొందజాలరు. పరిపూర్ణ నిర్భయత్వము ఆత్మసాక్షాత్కారమునకు తప్పక అవసరమై యున్నది. మఱియు ఈ మహోన్నతమగు 'నిర్భయత్వ' రూప సుగుణముచే ఓతప్రోతులై యుండిననేతప్ప ఎవరును సంఘమునకుగాని, దేశమునకుగాని వాస్తవమగు సేవను చేయజాలరు.

మీరు అజ్ఞానమునుండి, అహంకారమునుండి, ఇష్టానిష్టములనుండి, సాంసారిక వ్యక్తులను గూర్చిన, పదార్థములను గూర్చిన ఆసక్తినుండి విముక్తులైతిరా? మీకు వాంఛలు తొలగినవా? కీర్తిప్రతిష్ఠలను గూర్చినట్టియు, ప్రాపంచిక వస్తు సంపాదనమును గూర్చినట్టియు, సాంసారిక క్రియలను గూర్చినట్టియు భోగవిలాసములతో గూడిన జీవితమును గూర్చినట్టియు కోరికలు మీకు నశించినవా? ప్రపంచవాసులు

చేయు విమర్శలకు, నిందలకు ఉద్వేగమును బొందని స్థితి మీకు కలిగినదా? విశ్వమందలి సమస్త ప్రాణికోట్లయందును, పులియందును, తేలునందును, పామునందును, చీమయందును, ఆవుయందును, చండాలుని యందును, పాపి యందును, పతిత స్త్రీయందును భగవంతుని సందర్శించుచు, అన్నిటియందును సమబుద్ధిని మీరు అభివృద్ధిపఱచుకొంటిరా? శుకబ్రహ్మవలె విషయభావమును సంపూర్తిగా తొలగించి వైచితిరా? కామినీకాంచనములయెడల పూర్ణవిజయమును సంపాదించితిరా?

సంకల్పమునందు, వాక్కునందు, క్రియయందు అత్యంతపవిత్రతను బడసితిరా? మీ చిత్తకుహరమునుండి ప్రాపంచిక సంకల్పములన్నియు తొలగింపబడినవా? ఎల్లకాలము అంతరాత్మయందు మనస్సును ఏకాగ్రపఱచి అట్టి పరమాత్మతో నైక్యమొంది సహజ సమాధియందు మీరు వెలయుచున్నారా? దేహభావనను, ప్రపంచభావనను మీరు దాటితిరా? జీవితమును, మరణమును సమముగ జూడగల్గుస్థితి మీకు చేకూరినదా? లోకక్షేమముకొఱకు మీ సర్వస్వమును ధారబోయగల్గునట్టి త్యాగశీలత్వమును మీరు బడసితిరా?

నిజము చెప్పుడు! సంకోచింపవలదు! పై ప్రశ్నలకు 'ఔను' అని సమాధానము చెప్పగల్గుచో మీరు నిక్కముగ నిర్భీకులనియు మూర్తీభవించిన శుకబ్రహ్మలే యనియు, నిత్యజీవన్ముక్తులేయనియు నెఱుగుడు!

భయమనునది సర్వజీవరాసులకును సామాన్యముగనుండునట్టి ఆహార నిద్రాభయమైథునములను గుణములలో నొకటియై యున్నది. అద్దానిని జీవుడు ఈ ఉత్తమ మానవజన్మయందు తొలగద్రోసివైచి శివుడుగ మారకున్నచో నిర్భయత్వ సంపాదనమున విజయమును గాంచలేడు. అట్టి నిర్భయత్వము లేనిచో ప్రాణికోట్లకు హితము నాచరించుటకొఱకు మీరేమియు త్యాగము చేయజాలరు.

కాబట్టి మీ సహజస్వభావమేయగు నిర్భయత్వరూప సుగుణమును బాగుగ ఉద్దీపింపజేయుడు. భయమును పారద్రోలుడు. మీరు వాస్తవముగ పరిపూర్ణ నిర్భయరూపమగు పరమాత్మయే అయియున్నారు.

ఈ ప్రకారముగ మీరు నిర్భయశివ (బ్రహ్మ)రూపులై తదుపరి అట్టి అభయహస్తమును లోకమునకు చాచి సర్వులను సముద్ధరింపుడు! ప్రయత్నింపుడు! ప్రయత్నింపుడు! మీలో నిక ఏ దోషము లేనంతవఱకును ప్రయత్నింపుడు!!

పరాత్పరుడు సర్వులను అనుగ్రహించుగాక!!

హరిః ఓం తత్ సత్.

OO

# ఆధ్యాత్మిక కథలు

పూర్వము ఒక గురువు గారు ఏకాంత ప్రదేశమున ఒక చక్కటి ఆశ్రమమును నిర్మించుకొని యుండిరి. ఆ ఆశ్రమము ప్రక్కనే ఒక జీవ నది ప్రవహించుచుండెను. ఆ పరిసర వాతావరణమంతము పచ్చికబయ ళ్ళతో, ఆహ్లాదముగ, రమణీయముగ ఉండుటవలన ఆ ప్రదేశమెంతయో ధ్యానాభ్యాసమునకు, భగవచ్చింతనకు మిక్కిలి అనుకూలముగ ఉండెను.

ఆ ఆశ్రమములో గురువు గారు కొందరు శిష్యులకు, విద్యార్థులకు ఆధ్యాత్మిక విషయములను, పురాణములను బోధించుచు వారిని పరమార్థ మార్గమున నడిపించుచుండెను. వారికి మహాభారత, రామాయణ గాథలను వినిపించి అందలి తత్త్వములను వారికి చక్కగ ఉపదేశించసాగెను. శ్రీరామచంద్రుని యొక్క ధర్మనిరతిని, ధర్మరాజాదుల యొక్క సచ్చరిత్రను విద్యార్థులకు వివరించి చెప్పెను.

ఒకనాడు గురువుగారు తమ విద్యార్థుల యొక్క ప్రతిభను పరీక్షింప దలంచి వారిని ఇట్లు ప్రశ్నించెను–

"ఓ విద్యార్థులారా! నేను బోధించిన రామాయణ, మహాభారత గాథలను చక్కగ ఆలకించితిరిగదా! ఇపుడు ఆ రెండు గ్రంథములలోగల పోలికలను, సూక్ష్మ విషయములను ఒక్కొక్కరు మీరు చెప్పవలెను."

అందులకు విద్యార్థులందరూ సమ్మతించిరి. పిదప ఒక విద్యార్థి లేచి–"గురుదేవా! రామాయణమునందు నలుగురు సోదరులు కలరు, మహా భారతములో ఐదుగురు సోదరులు కలరు" అని సమాధానమిచ్చెను.

ఇంకొక విద్యార్థి లేచి, "గురుమహరాజ్! రామాయణ పుస్తకము యొక్క అట్ట ఎఱుపు రంగులో ఉన్నది. భారత గ్రంథము యొక్క అట్ట ఆకుపచ్చ వర్ణములో కలదు" అని ప్రత్యుత్తరమిచ్చెను.

మూడవ విద్యార్థి లేచి నిలబడి, "మహాత్మా! శ్రీరామచంద్రుడు 14 సంవత్సరములు వనవాసము చేసెను పాండవులు 12 సంవత్సరములు అరణ్యవాసము గడపిరి" అని పలికెను.

చివరి విద్యార్థి నిలబడి ఆయా గ్రంథములలో గల సూక్ష్మ విషయములను గురువు గారితో ఇట్లు విన్నవించెను– "గురుదేవా! స్వామీ! రామాయణమునందు రావణాసురుడు అనేక సంపదలతో, శక్తిసామర్థ్యములతో తులతూగుతున్నప్పటికి దారేషణవలన, కామమునలన నశించి పోయెను. మహాభారతమునందు దుర్యోధనాదులు అపారసైన్యముగలవారై నప్పటికి ధనేషణవలన, రాజ్యకాంక్షవలన నాశమొందిరి. పురోభివృద్ధిని కోరు మానవుడు ఈషణత్రయములకు అనగా ధనేషణ, దారేషణ, పుత్రేషణలకు లోనుకాకూడదు" అని చక్కటి సమాధానమొసంగి ఆ విద్యార్థి కూర్చుండెను.

ఆయా విద్యార్థుల ప్రత్యుత్తరములన్నిటిని ఆలకించిన గురువు గారు చివరి విద్యార్థి యొక్క జవాబునకు ఎంతయో సంతోషించి, ఆ పిల్లవానినే అందరిలోకెల్లా గొప్ప ప్రతిభావంతునిగ, సూక్ష్మగ్రాహిగ ప్రకటించి అతనికి చక్కటి బహుమతిని ఒసంగెను.

నీతి : పురాణగాథలను గాని, దైవసంబంధ చరిత్రలనుగాని విను నపుడు పైపైన తెలుపబడిన విషయములే కథాంశములే ఆయా చరిత్రల యొక్క ఉద్దేశ్యములని ఎవరును తలంచరాదు. వాటియందు తెలుపబడిన భగవద్భక్తి, వైరాగ్యము, ధర్మవిషయములను కూడ జనులు గ్రహించి ధర్మపూర్వకమైన, దైవమయమైన, దివ్యమైన జీవితమును గడుపుటనే అలవరచుకొనవలెను. ○○



# శ్రీ మహర్షి మలయాళ స్వాములవారు

ముముక్షువులు తము యాత్మలో విచారణచేసి తెలుసుకొనఁదగిన విషయము తామిప్పుడు తమోగుణములతో గూడియున్నామా, రజోగుణముతో గూడియుంటున్నామా, సత్త్వగుణముతో గూడియున్నామా, లేక విశుద్ధతత్వముతో గూడియుంటున్నామా అనునది 1) పాపస్వభావము నశించిన తమోగుణము క్షయించినదనియు, 2) విషయాసక్తి, భోగపరత్వము క్షీణించిన రజోగుణము నశించినదనియు, 3) సుకుమారత్వము, సుందరత్వము, ఆశ లేమిచో సత్త్వగుణము గూడ విలయమైనదనియు తెలుసుకొనవచ్చును. నిరభిమానము, నిరాడంబరము, ఇంద్రియ నిగ్రహము, లభించినదానితో తృప్తియు గలిగినచో విశుద్ధతత్వము గలిగినదని నిశ్చయించుకొనవచ్చును. జీవన్ముక్తులకు, ఆత్మజ్ఞానులకు, ఈ విశుద్ధతత్వము మాత్రమే మిగిలియుండును సత్త్వగుణము దేహేంద్రియ సుకుమారత్వముచే బంధించును రజోగుణము కామ్యకర్మకలాపముచే జీవుని బంధించును తమోగుణము సోమరితనముచే ఆత్మను బంధించును.

ధ్యేయాకారములో ఈశ్వర భావములో, దైవధ్యానములో మనసు నిలకడ పొందినవారికి మనోనిశ్చలత్వము గలుగుటకొరకొక్క యుపాయము తెలిపెద. యేటవాలుగా పాచిపట్టియుండు బండమీద నడచునప్పుడు ఒకవేళ జారిపడిన, యేదైన ఒక తీగనుగాని, వేరునుగాని పట్టుకొనిన యేలాగున జారిపడక యుండవచ్చునో, అలాగున ధ్యానమునుండి మనస్సు దృశ్యవిషయములోనికి జారిపోవుచుండిన జ్ఞేయస్థితిలో నిలుచు శక్తి లేకపోయిన, సాకారమగు ఇష్టదైవ రూపమునుగాని, లేక బ్రహ్మనిష్ఠుడగు గురుదేవునియందుగాని, లేక భవసాగరము దాటిన మరియొక్కరినిగాని భావనజేసినచో మనోనిగ్రహము గలుగును.

ఇదే ప్రకారము పిల్లలు ఆడుకొనుచుండు పడవలు ప్రవాహములో పడి కొట్టుకొనిపోవుచుండిన వాడేడ్చుచున్నప్పుడు నదీతీరములో యుండి పెద్దవారొక త్రాడును పడవలోనికి విసిరివేసి యేలాగున దానిని పట్టుకొని లాగుచు పిల్లవారు నదీతీరమును చేరుచుందురో, అదిన్ని పైజెప్పిన విధముగా యుండును. దీనికొరకే కొన్ని కొం

డలు యెక్కి-పోవు చుండు ప్రదేశములలో ఇనపగొలుసులు గూడ వేసి యుందురు

సత్త్వాది మూడు గుణములు గలవారి ఆత్మయొక్క స్థితిని గురించి తెలిపెద. మేఘము నుండి వర్షించెడు జలము శుద్ధమైన భూమిలో పడినచో దానిని పానముజేయువారు ఎంత ఆరోగ్యవంతులైయుందురో, ఊషరక్షేత్రములో పడిన ఉదకమును పానముజేయువారు ఏలాగున దాహపరులై అశాంతిగల్గియుందురో, దుర్వాసనగల ప్రదేశములోపడిన నీరును త్రాగువారు ఏలాగున రోగులుగా యుందురో అలాగున సత్త్వగుణ హృదయముగలవారు యెల్లప్పుడును ప్రసన్నులుగాను, ప్రశాంతులుగానుందురు. రజోగుణముగలవారు వ్యాకులస్వభావము గలవారుగా యుందురు తమోగుణముగలవారు రోగులుగాను, దుఃఖులుగాను యుందురు ఈ మూడింటికి ఆవల విశుద్ధ గుణముతో యుండువారు జ్ఞానులుగాను, నిరంతరానంద స్వరూపులుగాను యుందురు. వీరు భూమిలో పడని వర్షజలమును మంచి గ్లాసులో పెట్టుకొని యుపయోగపరచెడువారివలె యుందురు. ఈ ఉదకము ఎంత ఆరోగ్యకరమో, ఆనందకరమో తెలిసికొనందగినది. కావుననే గొప్ప గొప్ప ఆస్పత్రులలో భూమిలో పడకనే పెద్ద పెద్ద గ్లాసులలో వర్షజలమును భద్రపరచి కొన్ని రోగములు గలవారికి యుపయోగపరచెడు రహస్యము.

తాను జన్మించిన కుల (దేహ) ఆశ్రమధర్మమును మాత్రము ఆధారము చేసుకొని వర్తించువాడు రాగినాణ్యముల విలువను పొందును, జీవధర్మమగు అంతఃకరణము ననుసరించి ప్రవర్తించువాడు, వెండినాణ్యముల గౌరవమును పొందును. జీవస్వభావము లెస్సగా యెరిగి ప్రవర్తించువాడు సువర్ణ నాణెముల గొప్పతనము నొందును. జీవాత్మయందు పరమాత్మావస్థను గలిగినవాని మహిమ, విలువ వర్ణనాతీతము. అనగా అనంతము.

మీలో యెవరైన కొన్ని సంస్థలుగాని, సమాజములుగాని నడుపుచున్నప్పుడు చక్కగ నడవకపోయిన మనస్సున నశాంతి గలుగునప్పుడెల్ల గొప్ప గొప్ప స్థాపనములు నడిపిన మహాపురుషులను, అనగా శ్రీ యేసుక్రీస్తు, శ్రీ మహమ్మదునిబీ, శ్రీ బుద్ధదేవుడు, వర్తమాన కాలపు శ్రీ గాంధీ గారు మొదలైనవారినిన్నీ జ్ఞాపకము చేసుకొనిన త్వరలోనే మనస్సు శాంతినొంది నిర్వహణశక్తి గలిగినదగును. పై జెప్పినవారిలో యెంతో సహనము కలిగి అట్టి గొప్పకార్యము నిర్వహించినప్పుడు ఇంత చిన్న కార్యము చేయ శక్తి లేని మనము ఇక ప్రపంచములో యేమి గొప్ప కార్యము చేయగలమని భావనజేసినజాలును. మనస్సు వెంటనే స్వాధీనమగును. పూర్వాధికము కార్యనిర్వహణశక్తి గలుగును.

OO

# ఈశ్వర్

శిష్యుడు—ప్రకృతి, వికృతి అంటారు నాకు బోధపడుటలేదు గురుదేవా?

గురువు—ఎవరి వస్తువు వారివద్ద వుండుట ప్రకృతి ఇతరుల వస్తువులను దోచుకొనుట వికృతి. ఇతరులకు ఇచ్చుట సంస్కృతి.

శిష్యుడు—కారములు ఎన్ని రకాలు స్వామి?

గురువు—కారములలో ఎన్నో రకాలు గలవు. అందులో ప్రమాదమును కలిగించనవి మూడు. అపకారము, అహంకారము, ప్రతీకారము. అను మూడు కారములు మానవునికి వికారము కలిగించి వికాసమును, వివేకమును పోగొట్టును.

శిష్యుడు—మరి ఏ కారమును మానవుడు అవలంబించాలో తెలవిస్తారా?

గురువు—నాయనా! ఉపకారము, సహకారము అను రెంటిని ఆచరించిన వాడు ఉత్తముడై విరాజిల్లగలడు.

శిష్యుడు—**శాంతి,** సుఖము పొందుటకు మార్గము తెలవిస్తారా?

గురువు—**కష్టలు,** కార్పణ్యాలు వదలి కనికరమును, ప్రేమను పెంచుకొనుము.

2. **సంసారములో** వున్నను ఉత్తమ సంస్కారమును కలిగియుండుము.

3. **అర్థము** ఎట్లున్నను పరమార్థమును, **విధి** ఎట్లున్నను దైవసన్నిధిని అలవరచుకొనుము.

4. ఇతరులను బాధించుట మాని దైవము కొరకు, ధర్మము కొరకు **పాటు** పడుము— ఈ సద్గుణములే శాంతి, సుఖములకు మార్గములు.

శిష్యుడు—స్వామీ! ఇంకేమైనా మాకు మంచిదారి చూపించు మహావాక్యాలు సెలవిస్తారా?

గురువు—నాయనా! జాగ్రత్తగా వినుము. పథకాలు వేయుటలో సిద్ధహస్తులై ఆచరణలో బద్ధకస్తులు కాకూడదు.

చమత్కారాలు ఎన్ని చేసినా మహత్కార్యాలు సాధించాలి.

సాధకులు ఈ క్రింద తెలుపబడిన మహోన్నత భావములను నిరంతరము మననము చేయుచుండవలెను.

ఎవరి అనుగ్రహముచే 'నేనే విష్ణువును—నాయందే సమస్త ప్రపంచము కల్పింపబడినది'— అని తెలిసికొనుచున్నానో, నా యొక్క సదాత్మరూపమును ఎఱుగుచున్నానో అట్టి గురుదేవుని పాదద్వయమునకు నిరంతరము ప్రణమిల్లుచున్నాను.

OO

సత్సంకల్పముతో సత్కార్యక్రమాలు చేసి సద్గతి పొందాలి. దుస్సంకల్పములను దూరీకరించాలి.

భ్రమలో పడకుండా బ్రహ్మమును పొందాలి

మతి చెడినచో గతి చెడును కావున మతిలో మాలిన్యము లేకుండా చేసుకోవాలి.

**శిష్యుడు**—గురుదేవా! దేవుడు ఒక్కడే అంటారు. దేవునకు చాలా పేర్లు ఎలా వచ్చాయో తెలవిస్తారా?

**గురువు**—నాయనా శ్రద్ధగా, చక్కగా వినుము.

"ఏకం సత్ విప్రాబహుధా వదంతి"

"వస్తువు ఒక్కటే. పేర్లు అనేకము" అని ఉపనిషత్ చెప్పినది. వాటర్, జల్, నీరు, పానీ, తన్ని— ఇవి అన్నియూ ఒకే నీటియొక్క పేర్లు. భాషాభేదమే కాని భావము ఒక్కటే. చెవిరింగు, మెడలో హారము, చేతి ఉంగరము, గడియారం, గొలుసు ఇవి అన్నియు ఒకే బంగారం యొక్క రూపములేగాని అన్యము కాదు.

ఈ విషయాలు బాగా జీర్ణించుకో నాయనా!

**శిష్యుడు**—అలాగే! గురుదేవా! సెలవు.

OO

## డాక్టర్ ఎస్.బి.రఘునాథాచార్యులు గారు M.A., Ph.D.

(తిరుపతి)

***ప్రశ్న : ధృతి అంటే స్థైర్యం కదా! అది సాత్త్విక ధృతి అని, రాజస ధృతి అని, తామసధృతి అని మూడు రకాలుగా వుంటుందిట కదా! వాటి ప్రత్యేక లక్షణాలేమిటి?***

**జవాబు :** అనన్యమైన యోగంద్వారా మనస్సు, ప్రాణాలు, ఇంద్రియాలు వీటి వ్యాపారాలను నిగ్రహించి, నియమించి లక్ష్యాన్నుంచి పతనం కాకుండా వాటిని దృఢంగా ధరించే స్థైర్యానికే సాత్త్విక ధృతి అని పేరు. సుఖాసంగం వల్ల, ఫలాభిలాషలో ధర్మం-అర్థం-కామం అనే త్రివర్గాన్ని జీవితలక్ష్యంగా ధరించే స్థైర్యమే రాజస ధృతి. ఎవడు నిద్రను, భయాన్ని, చింతను, దుఃఖాన్ని, మదాన్ని దుర్బుద్ధిలో ఏ స్థైర్యంవల్ల విడిచిపెట్టడో అది తామసధృతి. వీటిలో తామస-రాజస స్థైర్యాలను వదిలి, సాత్త్విక స్థైర్యాన్ని పెంపొందించుకోవాలి.

[illegible]

(భగవద్గీత 18-33)

(33 నుండి 35 శ్లో వరకు)

***ప్రశ్న : మానవుడికి ఎన్నో రకాల సుఖాలు కలుగుతాయి. కొన్ని మొదట్లో అట్టే బాగుండవు, కాని తరువాత బాగుంటాయి. ఇంకొన్ని మొదట్లో చాలా బాగుంటాయి. కానీ కాలం గడిచేకొద్దీ బాగుండవు. ఇంకా కొన్ని మొదట చివఱ కూడా అజ్ఞానంలో ముంచి వేస్తాయి. వీటినేమంటారు?***

**జవాబు :** సుఖాలు సాత్త్విక-రాజస-తామస భేదంతో మూడు రకాలు. ఏది మొదట విషంలాగా చాలా కష్టాన్ని కలిగించి, కాలక్రమేణ అభ్యాసం చేయగా చేయగా

చెట్లు సకాలమునకు పుష్పించునట్లు, పాప మనుజుడు తన పాపకార్యముల యొక్క ఘోరఫలితములను (దుఃఖాదులను) సకాలములో పొంది తీరును.

ఆహారము, నిద్ర, భయము, మైథునము మున్నగునవి ప్రాణులన్నిటికిని సమానముగనే యున్నవి. జ్ఞానము కలవాడే మానవుడని చెప్పబడును. జ్ఞానము లేనివాడు పశువని పేర్కొనబడును.

OO

అమృతంలాగా పరిణమిస్తుందో, ఏది నిర్మలమైన బుద్ధియొక్క ప్రసన్నతవల్ల కలుగుతుందో, ఆ సుఖం సాత్త్విక సుఖం. తన కిష్టమైన శబ్ద-రూపాది విషయాలలో శ్రోత్ర-నేత్రాది జ్ఞానేంద్రియాలకు సంయోగం కలిగితే అమృతంలాంటి ఆనందం కలుగుతుంది. కాని కాలం గడవగా అది పరిణామాన్నంది విషతుల్యమై దుఃఖాన్ని కలిగిస్తుంది. అదే రాజస సుఖం. నిద్రవల్ల, బద్ధకంవల్ల, అజాగ్రత్తవల్ల తాత్కాలికంగా సుఖం కలుగుతుంది. ఇది మొదట్లోను చివరకు కూడా ఆత్మను అజ్ఞానంలో పెడుతుంది. అలాంటి సుఖం తామససుఖం. వివేకం గలవాడు సాత్త్విక సుఖాన్నే కోరతాడు. రాజస-తామస సుఖాలను దగ్గరకు రానీయడు.

(భగవద్గీత 18-37)

(37 నుండి 39 శ్లో. వరకు)

OO

# శ్రీ బ్రహ్మచారి గోపాల్ గారు (తిరుపతి)

సేవాధర్మంలో సేవజేసే నీవు సేవకుడవు. తక్కువవాడవు నీ సేవను బొందే వాడు నీకంటే గొప్పవాడు–అధికుడు ఇది సేవలోని సేవ్యసేవక ప్రభుసేవక సంబంధము ఈ ప్రభుసేవక సంబంధం తొలగినపుడు సేవాధర్మమే అంటే సేవ అనేదే తొలగిం దనాలి–పై భావము సేవను పొందేవానిని నీకంటే గొప్పగా చూచినపుడే సిద్ధిస్తుంది. ఆ గొప్పతనం–ఆ యాదరణభావము ఆ సేవితుని శరీరంగాగాక అతనిలోని పరమాత్మను దర్శించి అతనిని సాక్షాత్తు నరరూప నారాయణునిగా భావించి దర్శించిననాడే సంభ విస్తుంది. కావుననే శాస్త్రాలు నీవు సేవచేసే మానవునిలో మాధవత్వాన్ని చూడమ న్నాయి, అతనిని మానవునిగాగాక మాధవునిగా భావించమన్నవి. నాడు అతనికి నీవు చేయుసేవ మాధవసేవ నారాయణార్చన–భజనయేయగును.

కాబట్టి సేవితుని మూడుమూళ్ళ మృణ్మయశరీరంగా గాక చిన్మయపరమాత్మగా భావించాలి అన్నాను. అట్టి భావన గల్గిననాడు నీకాతనిపై గౌరవము, ఆదరణ, భక్తి అధికంగా గల్గుతుంది. ఈ నమ్రత, భక్తి నీలోని అహంకారాన్ని పెకళించి పారవేయుటేగాక క్రొత్తగా అంకురింపనీయదు. అపుడు నీవు చేయు సేవ అసలైన మానవసేవ. సిసలైన మాధవసేవ అవుతుంది.

మానవునిలో మాధవత్వాన్నే ఆధారంపై చూడాలి? అంటావా! భగవానునికి విష్ణువు అను పేరు అతని సర్వవ్యాపకత వలన వచ్చింది. మరి మాధవుడు సర్వ వ్యాప కుడైనప్పుడు ఆయనలేని చోటేది? ఆయన లేని చోటంటూ వున్న ఆయన సర్వ వ్యాపకతయెట్లు సిద్ధించును? గాన దైవం సర్వవ్యాపి ఆయన లేని చోటు లేదు అని తేలింది. అట్టితరి నీ సేవ్యుడగు దీనునిలో మానవునిలోను ఆ భగవానుడు వ్యాపకుడై యున్నాడు గదా! అందుచే ఆ దీనునిలో శరీరదృష్టి నుంచక తదంతర్వర్తియగు మాధవుని దైవరూపాన్ని దర్శించు. 'మత్తః పరతరం నాన్యత్కించి దస్తి ధనఞ్జయ' అను గీతా వచనము దైవము యొక్క సర్వవ్యాపకతను చాటుచున్నది. అంతియేగాక సర్వభూతములందున్న దైవమును ఏకాగ్రతతో సేవించు, నమస్కరించు' అని శాస్త్రములు ఆదేశిస్తూన్నవి. కావున నీవు సేవచేసే మానవుని మాధవునిగా దర్శించి ఆ పరమాత్మ భావనతోనే మానవసేవ చేయాలి. ○○

# భక్త చోఖామేళ

## శ్రీ ఓంప్రకాశ్ గారు

మహారాష్ట్రంలోని పాండురంగని భక్తులలో అనేక రకాల వారున్నారు అం దులో అంత్యకులానికి చెందిన చోఖామేళుడు, పాండురంగనియందు అపారమైన భక్తి గలవాడు. అయితే అంత్యకులస్థుడని, అతనిని ఆలయంలోకి వెళ్ళనిచ్చేవారు కాదు. చోఖామేళుడు ఆలయం బయటనే కీర్తన-నృత్యాలను చేస్తూ భగవంతుని ప్రార్థిస్తూ తన భక్తిని కనబరిచేవాడు.

అతని అనన్యభక్తి విశేషం అర్చక బ్రాహ్మణులు గుర్తించక, అతన్ని హేళన చేసేవారు "నీ భక్తి నిజమైతే, పాండురంగడు నిన్ను ఆలయంలోకి ఎందుకు రప్పించుకోడూ?" అంటూ పరిహాసం చేసి నవ్వేవారు.

ఆ మాటలు విని చోఖామేళుడు విపరీతమైన బాధకు లోనయ్యేవాడు "అంత్యకులంలో పుట్టిన పాపానికి నాకు పాండురంగని దివ్యదర్శనం కలగటం లేదు కదా! ఈ జన్మ వృథా" అని విలపించేవాడు.

అతని భార్య సాయిరాం బాయికి భర్త మనసు తెలుసును. భర్త చిత్తంలోని విశుద్ధ భక్తి ఆమెకు తెలుసు. భర్తను చేతనయినంత వరకు ఓదార్చేది. సమయం ఆసన్నమయినప్పుడు, భగవంతుని దర్శనం కలుగుతుందని నమ్మబలికేది. చోఖా మేళుడు భార్య సానుభూతితో కాస్త శాంతించేవాడు.

ఇలా అతని భక్తి దినదినం పెరిగిపోసాగింది భగవంతుని దర్శనం కోసం అతని చిత్తం తీవ్రంగా పరితపించసాగింది. ఒకమారా తాపాన్ని భరించలేక, రాత్రంతా విల పిస్తూ వుండిపోయాడు. భార్య అతన్ని కనిపెట్టుకుని కూర్చున్నది. అంతలో దివ్య మైన ప్రకాశంతో పాండురంగడు వారికి దర్శనమిచ్చాడు. పాండురంగని దర్శించి వారు పరవశంతో పరమానందం చెంది పాదాలపై పడిపోయారు. పాండురంగడు

చోఖామేళుని చేయిపట్టి ఆలయం వైపుకు నడిచాడు. మూసిన తలుపులగుండానే తన భక్తునితో పాటు గర్భాలయంలోకి ప్రవేశించాడు.

"దేవా, నేను అంత్య కులస్థుడను. నా మూలంగా పవిత్ర ఆలయం అపవిత్ర మౌతుందేమో" - చోఖామేళుని మాటలు విని పాండురంగడు నవ్వి "భక్తిలేని శరీరం శవం. భక్తుడు చేరని ఆలయం శ్మశానం. నీలాంటి పరమభక్తులకు కాకపోతే, నా ఆలయాలు మరెవ్వరి కోసమున్నాయి? నేను ఆలయాల్లో వెలసింది భక్తులను దర్శించి, వారికి దర్శనం ఇవ్వటం కోసమే కాని, కులాల హెచ్చు తగ్గులు చూడటం కోసం కాదు. నాకు మనిషిలోని భక్తి ముఖ్యం. ఆ మనిషి జాతి, రంగు, రూపం ఇవన్నీ నేను గణించను. తల్లికి కుమారులంతా ఒకటే. పెద్దవాణ్ణి ఒక విధంగా, చిన్నవాణ్ణి ఒక రకంగా చూస్తుందా? చోఖా, అనన్యప్రేమగలచోటకాక, దైవం మరెక్కడుంటాడను కొన్నావు? నీలాంటి భక్తుల హృదయాలలో లభించే విశ్రాంతి, నాకీ ఆలయాలలో లభిస్తుందా?" అంటాడు

"భగవాన్, మరి నన్ను అస్పృశ్యుడంటారు కదా! అంటే ఏమిటి?"

"భక్తి హీనులకు భగవంతుని స్పర్శించే అర్హత లేదు. భగవంతుడూ-భక్తుడూ వేరు వేరు కాదు. భక్తి శ్రద్ధలు లేని ఈ మానవాధములకు నిజంగా నువ్వు అస్పర్శనీయుడవే. నిన్ను తాకటం కాదు, నీ నీడలో నిలిచే అర్హత కూడా వారికి లేదు. చోఖా, ఈ లోకుల మాటలు పట్టించుకోకు. హృదయంలో భక్తి ప్రపత్తులు లేనివాడే అంటరానివాడు. అనవరతం భగవంతుని చింతనలో గడిపేవారే పరమోత్తమ బ్రాహ్మణులు. నువ్వీ విషయంలో నిశ్చింతగా ఉండు. ఈ అగ్రకులాహంకారులకు కనువిప్పు కలిగే రోజు వస్తుందిలే"-అంటూ భగవంతుడు ఓదార్చాడు.

"పరమ పురుషోత్తమ, నిన్ను శాశ్వతంగా చేరి విశ్రమించే మార్గమేమిటో చెప్పవా?"

"చోఖా, మంచి మాటడిగావు. మనిషి అప్రయత్నంగా, అతి సులభంగా కావాలనుకుంటాడు. భగవంతుడు సైతం అంతకన్నా సులువుగా లభించాలనుకుంటాడు. మనిషి, పరమ సోమరిగా మారిపోయాడు చోఖా! ఏమైనా, పనిచేసినా, దానికి వంద వేల రెట్లు ప్రతిఫలం ఆశిస్తుంటాడు. మనిషిలో ఈ స్వార్థం, ఈ బద్ధకం ముందు పోవాలి. ఫలితం కోసం ఎదురుచూడకుండా, తాను చేపట్టిన కార్యాన్ని పూర్తి శ్రద్ధ, ప్రేమ- శుద్ధ చిత్తంతో చేయాలి. ఇలా చేస్తున్నాడా చెప్పు. మామూలు లౌకిక

కార్యాలలోనే అతను తన్ను తాను మోసగించుకోవటమే కాక, ఇతరులను మోసగిస్తూ చివరికి నన్ను సైతం వంచన చేస్తున్నాడు కదా! భార్యాబిడ్డలను సైతం హృదయ పూర్వకంగా ప్రేమించడు. వారి నుండి ఎంతో ఆశించి, దానికి బదులుగా ప్రేమ నటిస్తాడు. తాను చేసే పనిని ప్రేమించడు. అతని జీవితమంతా వ్యాపారసూత్రాలపై నడుస్తూ వుంటుంది. ఇంతకు ఇంత అయితే, అంతకు మరెంత, అన్న ఆలోచనలోనే వుండిపోతాడు తప్ప, ఒక్క క్షణమైన నిండు మనసుతో 'భగవాన్' అంటూ నన్ను స్మరించడు కదా!"

పాండురంగని మాటలు విని చోఖా కంటినిండా నీరు నింపాడు. "దేవా! మనుషుల్లో ఇంత క్రౌర్యం, ఇంత వంచన, ఇంత స్వార్థపరత్వం ఉన్నాయా? అయినా నువ్వు మాత్రం వారిని అనుగ్రహిస్తూనే వున్నావు. ఎంత కరుణ స్వామి నీకు!" అన్నాడు.

"మరేం చేయను చోఖా! వారు కూడ నా బిడ్డలేకదా! వారికి నేనుకాక మరెవ్వరు దిక్కు చెప్పు. అయినా వారిని మార్చటానికి ప్రయత్నిస్తూనే వుంటాను. నీలాంటి భక్తులను, ఆదర్శప్రాయంగా పుట్టిస్తూ వారిని కూడా అలా జీవించమని చెబుతూనే వుంటాను. కాని..."

"భగవాన్, ఇక వారి సంగతి వదిలేసి, ముక్తిమార్గం సెలవియ్యవా?"

"చోఖా, విను. నిరంతరం భగవంతుని నామాన్ని స్మరించాలి. సర్వదైవీగుణాలను కల్గియుండాలి. సత్పురుషులతో వుంటూ, వారి జీవితాలు గమనిస్తూ తమ జీవితాలను సరిదిద్దుకుంటూ, సర్వదోషరహితుడు కావాలి. ఇలా గావించేవారికే నా ఉత్తమ పదం ప్రాప్తిస్తుంది. చిరశాంతి లభిస్తుంది. గుణహీనుడు, దోషయుతుడు, నాకెంత సమర్పించినా, అతనికి మోక్షం లేదు. అయితే అలాగైనా నా చెంతకు వస్తుంటే, నీలాంటి ఆదర్శభక్తుల దర్శనం వారికి కలుగుతూ వుంటుంది. నీలాంటి వాళ్ళను చూసి, క్రమక్రమంగా వారిలోనూ మార్పు వచ్చే అవకాశం వుంటుంది అందుకే ఆలయ దర్శనం తప్పకచేయాలి. కానీ నీలాంటి భక్తులను నిషేధిస్తే ఇక ఆలయ దర్శనంవల్ల ప్రయోజనమేముంటుంది? ఆలయంలోకి రావటం నన్ను చూడటం కోసం కాదు. నన్ను తమ చిత్తంలో వుంచుకొన్న నీలాంటి భక్తులను చూడటం కోసమే. నన్ను చూడటంకన్నా, నా భక్తుడిని దర్శించి, మారటం ముఖ్యం సుమా!"

"దేవా! చదువూ సంధ్యలు లేనివాణ్ణి. నాకిదంతా ఎందుకు చెబుతున్నావు?"

"నీ చిత్తం నిర్మలంగా వుంది. నిర్మలచిత్తంలోకే నా తత్త్వం ఎక్కుతుంది మరి?"

అలా వారు మాట్లాడుతూ వుండగానే తెల్లవారిపోయింది. అర్చక బ్రాహ్మణులు వచ్చి చోఖామేళుని చూసి కోపంతో మలమల మండిపోయి భగ్గున లేచారు. "చోఖా, నువ్విక్కడ వుండటానికి వీలులేదు. వెళ్ళు చంద్రభాగకు అవతలివైపున వుండు. మరల ఇటువైపు వచ్చావా, అంతే" అంటూ శాసించారు. పాండురంగడు చిరునవ్వుతో చోఖాను అనుగ్రహించి, నిర్భయంగా ఉండమన్నాడు. చోఖామేళుడు నదికి అవతలి వైపున నివసించసాగాడు.

ఒకరోజు చోఖా భోజనం చేస్తుంటే, పాండురంగడు వచ్చి, తానూ పంక్తిన కూర్చున్నాడు. ఆ దంపతులు పరమానందంతో ఆతిథ్యమిచ్చారు. చోఖా భార్య పొరపాటున పెరుగును పాండురంగనిపై పోసింది. చోఖాకు కోపం వచ్చి, "కండ్లు కనపట్టం లేవా" అన్నాడు. ఆ మాటలు అటు వెళుతున్న ఒక బ్రాహ్మణుడు విని, అవి తననే అన్నవనుకొని వచ్చి చోఖా లెంప వాయించాడు. స్నానంచేసి ఆలయంలోకి వెళ్ళాడు. కాని పాండురంగని విగ్రహం చూసి భయభ్రాంతుడయ్యాడు. ఆ స్వామి చెంపవాచి ఉంది. కంటినిండా నీరుంది. "ఇదంతా భక్తుని యెడల నీవు చేసిన అప రాధం. అతన్నే ఆశ్రయించు" అంటూ పెద్దలు సలహా ఇచ్చారు. బ్రాహ్మణుడు చోఖా కాళ్ళు పట్టుకున్నాడు. చోఖా వచ్చి భగవంతుని ప్రార్థించి, తప్పు మన్నించమన్నాడు. భగవంతుడు ప్రసన్నుడయ్యాడు.

చోఖా పరమభక్తితో జీవిస్తూ, జీవితాన్ని భగవంతునికే అర్పించి, సమయం రాగా దేహాన్ని చాలించాడు. అతని అస్థులతో పాండురంగని ఆలయం ముందు అతని స్మరణార్థం సమాధి ఒకటి వెలసింది.

చోఖాలాంటి భక్తులు నూటికో కోటికో ఒకరు కదా! OO

---

It is not the receiver that is blessed, but it is the giver.

దానక్రియయందు పుచ్చుకొనువాడు కాదు ఉపకారము బడసినవాడు. ఇచ్చువాడే వాస్తవముగ ఉపకారమును పొందినవాడు.

---

శుక్రగ్రహము సూర్యుని చుట్టూ తిరుగు గ్రహములలో రెండవది. ఇది సూర్యునకు 6 కోట్ల 70 లక్షల మైళ్ళ దూరమున గలదు. ఇది మిక్కిలి ప్రకాశవంతమైన గ్రహము. ఇది ఒక్కొక్కప్పుడు పట్టపగలు కూడ కనుపించును.

2. ధృవ ప్రాంతమందలి ఉడ్‌చక్ అను జంతువు 5 నిముషములకు ఒక సారి మాత్రమే ఊపిరి పీల్చును.

3. ఒక మిడుతల దండు 60 మైళ్ల వెడల్పు వుండును. ఆ దండు ఒక గంటకు 9 మైళ్ళ వేగముతో ప్రయాణించును.

4. ప్రపంచము మొత్తము మూడు వంతులలో రెండు వంతులు లవంగములను తూర్పు ఆఫ్రికాలోని టాంజానియా విభాగమైన జాంజిబార్ సరఫరా చేయుచున్నది.

5. అమెరికాలోని చికాగోనందు గల జలజంతు, వృక్షప్రదర్శనశాలలో (ఎక్వారియం) 10,000 రకముల సాగర జీవులు కలవు.

6. శిరస్సునందలి వెంట్రుకలను కత్తిరించకుండా పెరుగనిచ్చినచో అవి 12 అడుగుల పొడవుకంటే ఎక్కువ పొడవు పెరగవు.

7. భారతదేశములోని కలకత్తాలో నివసించు మోహన్ ఆదిత్య అను వ్యక్తి యొక్క ఎడమచేతి వేళ్ళ గోళ్ళ పొడవు 50 ½అంగుళములు.

()()

---

God first, world next, yourself last.

**దేవుడు మొదట, ప్రపంచము తరువాత, నీవు ఆఖరికి–**

***(నిద్ర లేవగనే మొదట దేవుని సేవింపుము. తరువాత ప్రాణి కోట్లకు ఉపకారము చేయుము. ఆ తదుపరి నీ విషయము ఆలోచించుకొనుము.)***



# వసిష్ఠవాణి

## యోగవాసిష్ఠసారము

శ్రీ వసిష్ఠ మహర్షి శ్రీరామచంద్రునకు ఇట్లు బోధించిరి-

ఆత్మయందు జనన మరణములు లేవు మనస్సే (దేహాదులద్వారా) జనించుచున్నది. మనస్సే మరణించుచున్నది. అట్టి మనస్సును ఆత్మయందు లయమొనర్చిన ఆత్మరూపత్వము నొందును. అదియే మోక్షము. బంధమోక్షములు చిత్తాధీనములు ఇవ్విషయమున పూర్వము బ్రహ్మదేవుఁడు నాకు వచించిన నొక కధ చెప్పెద వినుము-

### చిత్తోపాఖ్యానము

అతి విశాలమై శూన్యమై భయంకరమైనట్టి ఒక మహారణ్యము కలదు. అందు హస్తలోచనయుతుఁడగు విశాలాకారముగల నొక మనుజుడు గలడు ఆతడు తన యనేక హస్తములతో ననేక గుదియ (దండము)లను గైకొని తనపై తాను మోదుకొనుచు పరువిడుచుండెను. ఒకపుడు చీకటి నూతిలో పడెను. అందుండి చాలా సేపటికి లేచి మరల అట్లే తనపై తాను బాదుకొనుచు పరువెత్తి ఒక శీతల కదళీ (అరటి) వనమున ప్రవేశించెను. అటునుండి వచ్చి ఒకానొక కంటక వనమున ప్రవేశించెను. అటనుండి మరల నూతిలో పడెను మరల కదళీవనమున జొచ్చెను.

ఇట్టి యాచారము గలవానిని జూచి కారణమేమియని నేనడుగ 'నీవు నా శత్రువు. నీచే నేను ఛేదింపబడితిని' అని యేడ్చుచు తన యంగములను దాను జూచుకొని నవ్వి క్రమముగ వానినన్నింటిని త్యజించెను. ఈ ప్రకారముగ నా యడవిలో నింకను అనేకులను ఆ ప్రకారమే చేయుచుండుటను జూచితిని. కొందఱు నా బోధచే తమ యంగములనుత్యజించుచుండిరి. కొందరు నన్ను తిరస్కరించి వెడలి

పోవుచుండిరి. ఈ ప్రకారముగ దీర్ఘకాలము వఱకు వారా మహాటవియందు పరిభ్రమించుచు సుఖదుఃఖముల నొందుచుండిరి.

ఓ రామచంద్రా! దీని యంతరార్థమును వినుము. ఈ సంసారమే ఆ మహారణ్యము. జీవుల చిత్తములే ఆ ప్రహరము సల్పుకొను మనుజులు కొన్ని చిత్తములు నా బోధచే శాంతి నొంది తమ రూపమును త్యజించి ముక్తినొందుచున్నవి. కొన్ని వివేకమున బోధను ఉపేక్షించి తిరస్కరించి బంధముననె చిరకాలము తగుల్కొని యున్నవి ఆ యంధకూపమే నరకము. కదళీవనమే స్వర్గము. కంటకవనమే మనుష్య లోకము.

ఈ ప్రకారముగ మనస్సు స్వయముగనే దుఃఖమును విస్తరింపజేసికొనుచు పట్టుపురుగువలె తన్ను తానే బంధించుకొనుచున్నది. చిరకాలము సమాధి శీలించుట చేతను ఆత్మ భావన నభ్యసించుట చేతను మనస్సు సూక్ష్మత్వమునొంది దుఃఖరాహిత్యము నొందుచున్నది. మనస్సు యొక్క ప్రమాదము (అజ్ఞానము) చేతనే దుఃఖము వృద్ధి నొందుచున్నది. మరల మనస్సు యొక్క వివేకము చేతనే దుఃఖము నశించుచున్నది. కాబట్టి వాసనారాహిత్యము ద్వారా మనస్సును జయించి బ్రహ్మ (ఆత్మ) పదమును బొంది నట చిరకాలము స్థితి నొందినచో గొప్ప ఆపదలందును శోకమును బొందడు. వాస్తవముగ జ్ఞానికి బంధ మోక్షదృష్టులు రెండును లేవు మొదట మాయా శబలిత పరమాత్మ నుండి మనస్సు, ఆ మనస్సు నుండి జగత్తు (మిథ్యారూపమున) స్థితి బొందినవి.

దానం విత్తాదృతం వాచః కీర్తిధర్మౌ తథాయుషః
పరోపకరణం కాయాత్ అసారాత్సారమాహరేత్.

**వివేకవంతుడగువాడు తన జీవితములో అసారములైన వాటి నుండి సారవంతములైనవాటిని గ్రహించవలయును. అశాశ్వతమైన ధనము నుండి శాశ్వతమైన దానపుణ్యమును, క్షణికమగు వాక్కు నుండి శాశ్వతమగు సత్యమును, చపలమగు ఆయుస్సు నుండి శాశ్వతమగు ధర్మమును, కీర్తిని, నశ్వరమగు శరీరముద్వారా చిరస్థాయియగు పరోపకార పుణ్యమును ఆత్మసాక్షాత్కారమును సంపాదించవలెను.**

లోకములో ఎందరో మహనీయులు సత్కర్మాచరణపరులై, సదాచార వంతులై, చక్కని అనుష్ఠానముతో కూడియుండి తమ యొక్క దివ్యానుభూతిని ఇతరులకు వెల్లడించుచు గంభీరంగ మెలగుతూంటారు. సత్యమును అనుభూతం చేసుకొన్న మహాత్ములు కాబట్టి వారెల్లప్పుడు ఉత్సాహంగా, ఆనందంగా, శాంతంగా, గంభీరంగ ఉంటూంటారు. లోకులు చేసే నిందాస్తుతులకుగాని, మానావమానములకు గాని వారేమీ కలతపొందరు. హిమాలయపర్వతమువలె గంభీరంగ మెలగుతూంటారు.

ఒక చెఱువులో ఒకానొక గోవు నీళ్ళు త్రాగుటకు వచ్చింది. ఆ చెఱువు లోని కప్పలు బెకబెక శబ్దం చేస్తున్నాయి. ఆ శబ్దానికి భయపడి ఆవు పారిపోతుందా? ఎప్పటికిని పారిపోదు. అవసరమైన నీరు త్రాగినవెంటనే అది అచ్చోటు వీడిపోతుంది. కప్పల శబ్దాలకు అది ఏ మాత్రం జంకదు, తొణకదు. శీలసంపన్నులైన మహాత్ము లను గూర్చి కొందరు లేనిపోని విమర్శలు చేస్తూంటారు. అంతమాత్రంచేత మహా త్ములు కృంగిపోరు. నిందాస్తుతులను వారు లెక్కచేయరు. సమభావం కలిగి శాంతంగ ప్రవర్తిస్తారు. ఆత్మజ్ఞానం లేని సామాన్యులు మాత్రమే ఇతరుల యొక్క మానావ మానములకు జడిసి అశాంతచిత్తులై యుంటారు.

సత్యవస్తువగు ఆత్మను సందర్శించిన మహాత్ములు దృశ్యసంబంధమైన వస్తు వులచేగాని, లోకుల యొక్క వాక్యాలచేగాని ప్రభావితులెన్నటికిని కానేరరు. తనను చూచి ఇతరమైన చిన్న చిన్న జంతువులు కేకలిడుచున్నను ఏనుగు గంభీరంగా పోతూనేయుంటుంది. వాటి అఱుపులు చూచి అది బెదరదు, ఆగదు. మహనీయులు ఆ విధంగానే ప్రవర్తిస్తారు. కనుకనే వారిని గూర్చి "జనజల్ప నిర్భయులు" అని పెద్దలు వర్ణించారు. అనగా ఇతరులయొక్క ప్రలాపములకు లొంగనివారు అని అర్థము.

భగవద్గీతాది గ్రంథములందు సమత్వాన్ని గూర్చి విశేషంగా చెప్పబడింది. సాధకులు ఈ సమత్వాన్నే లెస్సగ అభ్యసించాలి. జనులు చేయు నిందాస్తుతులకు చంచలమైపోవు మనస్సు మోక్షాన్ని ఏ కాలమందును పొందలేదు. కాబట్టి సాధకులు, ముముక్షువులు ఇంద్రియములపై, మనస్సుపై జయాన్ని సంపాదించి మనస్సునందు

## (Life Members)

వేదాంతభేరి మాసపత్రికకు నూతనముగ చేరిన శాశ్వత చందాదారుల పేర్లు :-

### శాశ్వత చందా రు. 300/-లు

1. శ్రీ వి. లింగారెడ్డి గారు – గౌరెడ్డిపల్లి
2. శ్రీ పి.వి. మురళీధర్‌రావు గారు – మంచిర్యాల
3. శ్రీ పి. సోమరాజు గారు – గుంటూరు
4. శ్రీ చెలికాని అండాళమ్మ గారు – ఆకివీడు
5. శ్రీ తటవర్తి కోటేశ్వరరావు గారు – సింగరాయకొండ
6. శ్రీ ఎస్.ఎమ్. స్వామి గారు – బెంగుళూరు
7. శ్రీ సిహెచ్. సత్యనారాయణ గారు – విడమానూరు
8. శ్రీమతి ఎమ్. లలితమ్మ గారు – మహబూబ్‌నగర్
9. శ్రీ కె.ఎస్. రామయ్య గారు – బెంగుళూరు
10. శ్రీ బి. సన్న్యాసిరావు గారు – విశాఖ
11. శ్రీ బి. కళ్యాణి రామకృష్ణ గారు – విశాఖ
12. శ్రీ బి. చంద్రశేఖరరావు గారు – అగులు

ఏ విధమైన వికారం పొందక నిశ్చలచిత్తులై, నిర్మలహృదయులై యుండటాన్ని అభ్యసించాలి. అనవరత సాధనచేతను, అచంచల దైవవిశ్వాసము చేతను, ఆత్మానాత్మ వివేకము చేతను అట్టి సమస్థితి తప్పక చేకూరుతుంది. అట్టి సమస్థితిని ప్రయత్న పూర్వకంగ సంపాదించి మనస్సును, బుద్ధిని దాటి ఆత్మయందు స్థితిని పొందినచో ఇక జీవుడు కడతేరినట్లే. అట్టి మహోన్నతస్థితిని సంపాదించుటకొరకై తీవ్రతర సాధన చేయాలి. సద్గురువులను ఆశ్రయించి వారి అనుభవపూర్వక హితవచనాలను ఆలకించి, ఆచరించి తరించాలి. గంభీరస్వభావం కలిగి వర్తించాలి. ఈ భావములనే క్రింది వాక్యములు నిరూపించుచున్నవి-

పిబంతేఽహో వకలం గావో
మృగ్నాతేమృ రుదత్స్వపి

# బీద విద్యార్థులకు

# చక్కటి అవకాశం

ఆశ్రమము యొక్క పవిత్ర వాతావరణములో నివసించుచు ఆశ్రమ సమీపముననే గల గవర్నమెంటు ప్రాథమికోన్నత పాఠశాలలో బీద విద్యార్థులు తమ విద్యాభ్యాసమును కొనసాగించుటకై ఏర్పాట్లు చేయబడినవి.

ఈ పాఠశాలలో 7వ తరగతి వరకు విద్యా సౌకర్యము గలదు. విద్యార్థులు ఆశ్రమ హాస్టలులో నివసించుచు ఆ పాఠశాలలో విద్యాభ్యాసము చేసుకొనవచ్చును.

నివాసము,
భోజనము,
పుస్తకములు,
వస్త్రములు
మొదలైనవన్నియు

ఉచితముగ
ఏర్పాటు
చేయబడగలవు.

పాఠశాలలో చేరదలంచువారు తమ పేరు, వయస్సు, చదివే తరగతి, పూర్తి అడ్రసు మొదలైన వివరములతో కూడిన దరఖాస్తును 20.6.1993 తేదీలోగా ఈ క్రింది అడ్రసుకు పంపవచ్చును.

మేనేజరు
శ్రీ శుకబ్రహ్మాశ్రమము, శ్రీ శుకబ్రహ్మాశ్రమము P.O
శ్రీకాళహస్తి–517 640 చిత్తూరు జిల్లా (A.P)




# త్రినేత్ర వైద్యాలయము
## శ్రీ భక్తకన్నప్ప ఉచిత కంటి ఆస్పత్రి
## ప్రారంభోత్సవ సమీక్ష

**సమీక్షకులు : శ్రీ నరసింహరామదాసు గారు**

తేదీ 28.4.'93 శ్రీముఖనామ సంవత్సరము వైశాఖ శు॥ సప్తమి బుధవారము బ్రాహ్మీ ముహూర్తము 4 ఘ॥ 30 నిమిషములకు శ్రీ శుకబ్రహ్మాశ్రమములో శ్రీ విద్యా ప్రకాశానందగిరిస్వామివారి ఆధ్వర్యములో శ్రీత్రినేత్రేశ్వరస్వామి, భక్తకన్నప్ప విగ్రహ ప్రతిష్ఠ శ్రీ విద్యానందగిరిస్వాములవారు వ్యాసాశ్రమ పీఠాధిపతులు జరుపగా, శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ చిన్నజియరుస్వామివారు ఆస్పత్రి భవన ప్రారంభోత్సవం జరిపిరి. ఈ కార్యక్రమములో శ్రీశుకబ్రహ్మాశ్రమ కమిటీ సభ్యులు అందరు పాల్గొనిరి.

ఉదయము 9.00 ఘ॥ శ్రీ జి.యస్. రాజు గారు సిరీస్ అధినేత విజయవాడ అధ్యక్షతన మహాసభ ప్రారంభించబడెను. శ్రీ బి. గోపాలకృష్ణారెడ్డి గారు శాసనసభ్యులు శ్రీకాళహస్తి, జ్యోతి ప్రజ్వలనము చేసిరి. శ్రీమతి శోభారాజు గారు శ్రీ అన్నమా చార్య భావనా వాహిని హైదరాబాద్ ప్రార్థనా గీతాలతో సభాకార్యక్రమము ప్రారంభించ బడెను. శ్రీ టి. యోగయ్యనాయుడు గారు హైదరాబాద్ పరిచయవాక్యాలు పలకగా శ్రీ జి. శివయ్య గారు ప్రబోధానంద ప్రశాంతి నికేతన్ స్థాపకులు, హైదరాబాద్ ముఖ్య అతిథులకు పుష్పమాలాంకరణ గావించిరి. తొలిపలుకులుగా శ్రీ పి. వేంకటేశ్వర్లు

గారు హైద్రాబాద్, శ్రీ శుకబ్రహ్మాశ్రమ కమిటీ అధ్యక్షులు, కంటి ఆస్పత్రి స్థాపన విషయములో స్వామివారి కృషి, భక్తుల సహకారము, నిపుణుల మార్గదర్శకత్వము శ్లాఘించుచు అందరు అందించిన సహాయ సహకారాలతో నేడు ప్రారంభోత్సవము జరుపుకొనుట ఎంతో ముదావహమనిరి.

తదుపరి శ్రీ కె. ఈశ్వర్ గారు శ్రీ స్వాములవారి సెక్రటరీ తమ నివేదికలో కంటి ఆస్పత్రి ఏ విధంగా రూపుదిద్దుకొంది, పూర్తి చరిత్ర తెలుపుతూ ఎందరో మహానుభావుల ఆర్థిక సహకారము, సాంకేతిక మార్గదర్శకత్వము, మరియు దైవజ్ఞుల ఆశీర్వచనబలముతో త్రినేత్ర వైద్యాలయము భక్తకన్నప్ప ఉచిత కంటి ఆస్పత్రి శ్రీ శుకబ్రహ్మాశ్రమ ప్రాంగణములో ప్రారంభోత్సవము జరుపుకొనుట ఎంతో ఆనంద దాయకంగా వుందన్నారు. ఆస్పత్రి నిర్వహణకు అనగా సిబ్బంది వేతనములు, మందులు, కంటి అద్దాలు రోగి, వారి వెంబడి వచ్చిన మనిషికి భోజన సదుపాయ ములు వీటన్నిటికి నెలకు సుమారు రూ.50,000.00 ఖర్చు అంచనా వేయబడి, ఏబది లక్షల రూపాయలు ఫిక్సెడ్ డిపాజిట్‌గా బ్యాంకులో వేసి వాటిపై వచ్చు వడ్డీ ద్వారా ఆస్పత్రి ఖర్చులు భరించుటకు నిర్ణయించినట్లు తెలిపిరి.

ఆ విధంగా ఆస్పత్రి నిర్వహణకు ఒకరోజు ఖర్చు నిమిత్తము భక్తులు శాశ్వత సభ్యులుగా చేరుటకు రూ. 11,116.00 చెల్లించిన అట్టి పైకము ఫిక్సెడ్ డిపాజిట్ లో వుంచి బ్యాంకు ద్వారా వచ్చిన వడ్డీతో ఆ భక్తుని పేరిట ఒక రోజు ఖర్చు భరించబడునని తెలిపి ఇంతవరకు వందమంది భక్తులు పైకము చెల్లించారని, మిగతా రోజుల కొరకు భక్తులు సహకరించాలని కోరిరి.

శ్రీ కె. రోశయ్య గారు ఆర్థిక శాఖామాత్యులు ఆం.ప్ర. మాట్లాడుతూ ఈ రోజు అంధత్వముచే బాధపడేవారలకు ఈ ఆస్పత్రి ద్వారా మంచి అవకాశము కల్పించారని, ఈ ఆస్పత్రి మంచి అభివృద్ధిలోకొచ్చి ప్రపంచ వెలుగునకు దూరంగా వున్న అంధులకు దృష్టి ప్రసాదించి రాష్ట్ర స్థాయిలో మంచి సేవలను అందించగలదని అన్నారు. తమ ప్రసంగాన్ని కొనసాగిస్తూ దేశంలో అంధత్వ నివారణకు ప్రపంచ బ్యాంక్ ఆర్థిక సహాయము అందిస్తుందని తెలుపుతు భారతదేశములో అయిదు రాష్ట్రాలకు ప్రపంచ బ్యాంకు సహాయము అందించడానికి సమ్మతించినదని అందులో మన ఆంధ్ర రాష్ట్రము కూడా వున్నందున రాష్ట్రములోని 23 జిల్లాలలో దశల వారిగా కార్యక్రమము ప్రతి ఏడాది అయిదు జిల్లాల చొప్పున ప్రపంచ బ్యాంకు నిధులతో

అంధత్వనివారణ కార్యక్రమాలు చేపట్టనున్నట్లు అమాత్యవర్యులు వివరించారు.

తదుపరి శ్రీ కె సత్యరాజు గారు కమీషనర్ దేవాదాయ ధర్మాదాయ శాఖ ఆం.ప్ర. మాట్లాడుతూ శ్రీకాళహస్తి దేవాలయమునుండి ఇంతవరకు రః ఆస్పత్రికి 4 లక్షలు ఇవ్వబడినదని, ఈ సహాయము అందించినప్పటినుండి దేవాలయ ఆదాయము కూడా గణనీయంగా పెరిగిందని తమ సంతోషము వెలిబుచ్చుచు తిరుమల తిరుపతి దేవస్థానమునుండి కూడా ఆర్థిక సహాయము అందించే విషయములో కృషిచేస్తానని తెలిపారు

శ్రీ బి. గోపాల్‌క్రిష్ణారెడ్డి గారు, శాసనసభ్యులు, శ్రీకాళహస్తి మాట్లాడుతూ స్వామివారు కంటి ఆస్పత్రి నిర్మాణ విషయము నాతో సూచించినప్పుడు వెంటనే ఈ సత్కార్యములో నా పూర్తి సహాయ సహకారములు వుండునని మనవిచేస్తూ అప్పటి శ్రీకాళహస్తీశ్వర దేవాలయ ధర్మకర్తల సంఘాధ్యక్షుని సంప్రదించి వెంటనే ఈ ఆస్పత్రికి ఆర్థిక సహాయము అందించటానికి తీర్మానము చేయించాను అలాగే ధర్మాదాయ దేవాదాయ శాఖవారి అనుమతిని కూడా వచ్చేటట్లు కృషిచేశాను ఇతర భక్తుల ద్వారా సహాయము అందించడానికి కృషిచేస్తానని వాగ్దానము చేస్తూ, పట్టణము నుండి ఆశ్రమము వరకు తారురోడ్డు నిర్మాణమునకు అనుమతి లభించినదని త్వరలో పని ప్రారంభించబడునని సభ్యులకు తెలియజేశారు

శ్రీ కోనేరు రంగారావు గారు, దేవాదాయ శాఖామాత్యులు, ఆం.ప్ర. మాట్లాడుతూ ఈ కంటి ఆస్పత్రి ప్రారంభోత్సవములో పాల్గొనుట నాకెంతో సంతోషంగా వుందంటూ ఆర్థికస్థోమత గల దేవాలయ నిధులనుండి తగిన ఆర్థిక సహాయమును అందించడానికి ప్రయత్నిస్తానని తెలిపారు. వారు తమ యొక్క ఒక నెల వేతనమును ఆస్పత్రికి విరాళముగ ప్రకటించారు. తదుపరి శ్రీమాతా శివచైతన్యస్వామిని, కాకినాడ మాట్లాడుతూ త్రినేత్ర వైద్యాలయమని పేరిడుట సార్థకనామమని, అందులో ఆశ్రమ ఆవరణలో స్థాపించుట ఇంకను విశేషమని తెలిపిరి. ఎందుకనగా ప్రతివారికి మూడు కండ్లు వుండాలి. రెండు భౌతిక ప్రపంచము చూడడానికి మూడవది జ్ఞాన నేత్రము. భౌతికప్రపంచము చూడడానికి ఆస్పత్రిలో చికిత్స జరుగును. ఇక మూడవ జ్ఞాననేత్ర చికిత్స శ్రీ స్వామి వారి దివ్య అధ్యాత్మ జ్ఞానబోధలతో జరుపబడును. ఈ విధంగా త్రినేత్రములకు ఈ ఆశ్రమములో చికిత్స జరుగును. చాలా ఆనందదాయకము, త్వరత్వరగా అభివృద్ధిలోకి రాగలదని ఆశించారు.

శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ చిన్నజియరు స్వామివారు సందేశమిస్తూ ఈ వైద్యశాఖ వేదకాలములో అశ్విని దేవతల ఆధీనములో వున్నట్లు ఉపనిషత్తులు తెలుపుచున్నవి. తద్వారా ఈ వైద్యశాఖ అభివృద్ధి చెందినదని తెలిపారు. ఈ ఆస్పత్రికి వచ్చిన అంధులు త్వరత్వరగా దృష్టిని సంపాదించుకొని మళ్లీ ఆ బాధ పడకుండా వుండాలని, ఆస్పత్రి మంచి సేవలను అందించి పేరు తెచ్చుకోవాలని ఆశిస్తున్నాము. ఈ ఆధునిక యుగములో వైద్యరంగములో చాలా కృషి సలిపి ప్రతి అవయవమునకు ప్రత్యేక నిపుణులు తయారయ్యారు. కావున అటువంటి నిపుణుల సహాయ సహకారములు పొంది మానవసేవ చేయుటకు లభించిన చక్కని అవకాశమును సద్వినియోగము చేసుకోగలరని ఆశిస్తున్నానన్నారు.

తదుపరి శ్రీ విద్యానందగిరిస్వాములవారు శ్రీ వ్యాసాశ్రమ వ్యాస పీఠాధిపతి, ఏర్పేడు సందేశమిస్తూ ఆశ్రమములో త్రినేత్ర వైద్యాలయ స్థాపన ఇహము పరము రెండు సాధించడానికి అవకాశము కల్పించబడినది. ఆస్పత్రి ద్వారా భౌతికంగా దృష్టి పొందుట మరియు ఆశ్రమము ద్వారా ఆధ్యాత్మిక జ్ఞానదృష్టి పొందుట. పూర్వ కాలములో దేవాలయములు, విద్యాలయాలు, మరియు వైద్యాలయాల స్థాపనకు అధిక ప్రాముఖ్యతనిచ్చేవారు. ఈ ఆశ్రమములో ఆ మూడు ఆలయాలు ఏకస్థల ములో లభించుట ముదావహం. ఈ సత్కార్యములో ప్రతివారు తమ తమ వంతు సహాయము అందించి మానవసేవలో పాల్గొనగలరని ఆశిస్తున్నానన్నారు.

చివరికి అధ్యక్షులవారు శ్రీ జి.ఎస్. రాజు గారు, సిరీస్ అధినేత ఈ సభకు అధ్యక్షత వహించుట ఆస్పత్రి ప్రారంభోత్సవములో పాల్గొనుట తనకెంతో ఆనందంగా వుందని తెలుపుతూ తన వంతు చిన్న సహాయంగా లక్షరూపాయలు నగదును, మరి లక్షరూపాయల మందులను అందజేయగలనని వాగ్దానము చేశారు.

ఈ సమయముననే తిరుపతి వాస్తవ్యులు, గ్రూప్ థియేటర్స్ అధినేత అయిన శ్రీ చదలవాడ కృష్ణమూర్తి గారు ఆస్పత్రి కొరకు రూ.50,000/-లను వాగ్దానము చేసిరి. ఇంకను పలువురు భక్తులు వారివారికి తోచిన విరాళములను ఆస్పత్రికి సమర్పించిరి.

శ్రీ బి. శ్రవణకుమార్ గారి వందన సమర్పణతో ఈ సమావేశము ముగించ బడెను. మరునాడు 29.4.93 తేదీ శ్రీ శుకబ్రహ్మాశ్రమ 43వ వార్షికోత్సవము పలువురు మహనీయుల ఉపన్యాసములతో జయప్రదముగ జరిగినది. ○○






1) ఆశ్రమములో నెలకొల్పబడిన కంటి ఆస్పత్రి యొక్క ప్రారంభోత్సవము పూర్తయినది కాబట్టి ఇక అచట వైద్యసేవా కార్యక్రమములు ఆరంభింపబడినవి. కంటిరోగులు చికిత్స నిమిత్తమై తండోపతండములుగ వచ్చుచున్నారు. వారందరికి శ్రీ డా॥ సంపత్ ( శ్రీకాళహస్తి) గారి ఆధ్వర్యమున చక్కగా చికిత్స గావింపబడుచున్నది. కంటి ఆపరేషన్లు కూడా జరుగుచున్నవి. వివరములు రాబోవు సంచికలో ప్రకటించగలము.

2) బీద విద్యార్థులు ప్రాథమిక విద్యను అభ్యసించుటకై ఆశ్రమములో తగు ఏర్పాటుచేయబడినది. భోజనాది సౌకర్యములన్నియు ఉచితముగ ఏర్పాటుచేయబడియున్నవి. వివరములకై లోపలి పేజీలలో చూడ వచ్చును.

## భూరి విరాళములు

1. ఇటీవల ఏప్రిల్ నెల చివర శ్రీకాళహస్తి యందలి శ్రీ శుకబ్రహ్మాశ్రమములో జరిగిన త్రినేత్ర వైద్యాలయము – శ్రీ భక్తకన్నప్ప ఉచిత కంటి ఆస్పత్రి యొక్క ప్రారంభోత్సవ సందర్భమున నాటి సభాధ్యక్షులగు శ్రీ జి.ఎస్. రాజు గారు (సిరిస్ అధినేత, విజయవాడ) ఆస్పత్రికొరకు 2 లక్షల రూపాయల విరాళమును వాగ్దానము చేసిరి.

అందులో ఒక లక్షరూపాయలు నగదు రూపమునను, మరొక లక్ష రూపాయలు ఔషధముల రూపమునకు ఇచ్చునట్లు వారు ప్రకటించిరి.

2. ఆ సందర్భముననే బొంబాయి వాస్తవ్యులు, Excel Industries, M.D. అయిన శ్రీ జి. నారాయణ గారు ఆస్పత్రిలో జరుగుచున్న చికిత్సా కార్యక్రమములను చూచి సంతోషించి ఇదివరకు తాము ఆస్పత్రికి సమర్పించిన రెండు లక్షల రూపాయలు కాక మరొక లక్ష రూపాయలను వాగ్దానము చేసిరి.

3. ఆ ప్రారంభోత్సవ వైభవమును చూచి ఈ నేత్ర యజ్ఞములో పాలుపంచుకొను మహాభాగ్యాన్ని పొందాలనే సంకల్పముతో తిరుపతి వాస్తవ్యులు, గ్రూప్ థియేటర్స్ అధినేత, దానశీలురు అయిన శ్రీ చదలవాడ కృష్ణమూర్తి గారు ఆస్పత్రి కొరకు రు.50,000/–లను వాగ్దానము చేసిరి.

4. శ్రీ శుకబ్రహ్మాశ్రమ మేనేజింగ్ కమిటీ అధ్యక్షులైన శ్రీ పి. వేంకటేశ్వర్లు గారు ( M.D–కాకతీయ సిమెంట్స్, హైదరాబాదు) ఆస్పత్రికొరకై తాము ఇదివరకు సమర్పించిన జీవిత సభ్యత్వ పైకము రు.11,116/–లు కాక, మరి రు. 14,400/– లు సమర్పించిరి.

5. ఆస్పత్రి ప్రారంభోత్సవ సమయమున ఆపరేషన్ థియేటర్ యొక్క ఉద్ఘాటనము చేసిన దేవాదాయ ధర్మాదాయ శాఖామాత్యులైన గౌ॥ శ్రీ కోనేరు రంగారావు గారు తమ యొక్క ఒక నెల వేతనమును ఆస్పత్రికి వాగ్దానము చేసిరి.

6. ఆ ప్రారంభోత్సవ సమయమున ఈ క్రింద తెలుపబడిన భక్తులు ఆస్పత్రికి జీవిత సభ్యులు (Life Members)గా చేరి ఒక్కొక్కరు తమ విరాళముగు రు. 11,116/–లు సమర్పించిరి.

1. శ్రీ అంబికా కృష్ణ గారు – ఏలూరు
2. శ్రీ సిహెచ్.వి. ఆనంద్ గారు, S/o. శ్రీ వి. వేంకటరమణప్ప గారు –అనంతపురం
3. శ్రీ లారీ ఓనర్స్ అసోసియేషన్స్ – శ్రీకాళహస్తి
4. శ్రీ గమిని వేంకటేశ్వర్లు గారు – తణుకు
5. శ్రీ చెన్నా వేంకటరమణమూర్తి గారు – తుని
6. శ్రీమతి జె. ఉమావేంకటేశ్వరరావు గారు – హైదరాబాద్
7. శ్రీ నాగెళ్ళ మాణిక్‌రావు గారు – సికింద్రాబాద్

8. శ్రీ చేవూరు సుబ్బరామిరెడ్డి గారు , శ్రీ చేరుకూరు పట్టాభిరామిరెడ్డి గారు యల్లాయపాలెం

9. శ్రీ టి.పి. రత్నయ్య గారు – హైదరాబాద్

10. శ్రీ ఎస్. బాబూశంకర్ గారు – సికింద్రాబాద్

11. శ్రీ డా॥ బొజ్జా గౌరీశంకర్ గారు – సికింద్రాబాద్

12. శ్రీ కె.పి. వర్ధన్ గారు, టీచర్ – గద్వాల

దాతలందరికిని మా అభినందనలు.

కరుణామూర్తియగు సర్వేశ్వరుడు అనుగ్రహించుగాక! ○○

## గుహుని అకుంఠిత భక్తి

గుహుడు శ్రీరామచంద్రునితో నిట్లనుచున్నాడు-

మహాత్మా! మిమ్ము నా పడవలోనికి ఎక్కించుకొనుటకు ముందుగా మీ పాదములను నేను ప్రక్షాళనము చేయవలయును. ఎందుకనగా మీ పాదములకు అంటుకొనియున్న ధూళికి ఒక ఆశ్చర్యకరమైన శక్తి కలదు. అది రాళ్లను మనుష్యులుగా చేసివేయగలదు. (పాదస్పర్శచే ఇటీవలనే ఒక రాయి అహల్యగా మారిపోయినదిగదా) ఒకవేళ నేను మీ పాదములను కడుగకుండ, మీ పాదధూళిని తొలగించకుండ మిమ్ము నా పడవలో కూర్చుండబెట్టినచో పెద్ద ప్రమాదము సంభవించగలదు. ఏలయనగా నా పడవ చెక్కలతో చేయబడినదిగాన, రాతికి చెక్కకి సిద్ధాంతరీత్యా భేదము లేదు.

కావున నా పడవకు ఎన్ని చెక్కలున్నవో అందఱు ఆడవారు మీ పాదస్పర్శచే తయారు కావచ్చును. అపుడు వారి పోషణ వగైరా చూడలేక నాకు గొప్ప సంకటమేర్పడగలదు. కాబట్టి మహాత్మా! అట్టి ప్రమాదకరస్థితి కలుగకుండు నిమిత్తమై దయచేసి మీ పాదపద్మములను ప్రక్షాళన మొనర్పనిండు! ఆ మహద్భాగ్యమును నాకు దయచేయుడు!

క్షాలయామి తవ పాదపంకజే
నాథ దారుదృషదోః కిమన్తరమ్
మానుషీకరణచూర్ణమస్తి తే
పాదయోరితి కథా ప్రథీయసీ.

Printed and Published by **Vemuri Balaram** for Sri Sukabrahma Ashram, Sri Kalahasti Printed at Swati Press Anil Estates Vijayawada
**Editor : B. ESWAR**

# పాతంజల యోగసూత్రములు 1-12

(సంగ్రహము)

## అభ్యాస వైరాగ్యాభ్యాం తన్నిరోధః

*తా॥ అభ్యాస వైరాగ్యముల ద్వారా చిత్తవృత్తులను నిరోధించ వచ్చును.*

వ్యాఖ్య : మనస్సు దృశ్యముపై వ్రాలి విషయములను అనుభవించు నపుడు దానిని అటనుండి మరల్చి అంతర్ముఖము చేసి ఆత్మ యందు స్థాపించుట యెటులనో ఈ సూత్రము నందు చక్కగ వివరింపబడియున్నది. అభ్యాసము ద్వారా, వైరాగ్యము ద్వారా, వివేకము ద్వారా మనస్సును (చిత్తమును) బాహ్య ప్రపంచము నుండి మరల్చి అంతర్ముఖమొనర్చవచ్చును. భగవద్గీత యందు గీతాచార్యులు కూడా మనోనిగ్రహమునకు అభ్యాస వైరాగ్యములు అత్యంతావశ్యకములని పేర్కొనియుండిరి.

మొట్టమొదట ఈ ప్రపంచమునందలి సారాసారములను గూర్చి, నిత్యానిత్యములను గూర్చి చక్కగ హితబోధ గావించవలెను. అపుడు మనస్సునకు భోగవిలాసముల యెడల, ప్రాపంచిక వైభవముల యెడల విరక్తి జనించును. అత్తఱి మనస్సు అసార మగు బాహ్యమునుండి సారమగు అంతరంగమునకు (ఆత్మ వైపునకు) మరలును.

ఈ పద్ధతిని అభ్యాసము ద్వారా పదేపదే ఆచరించుచు రాగా కొంతకాలమునకు అభ్యాసము దృఢపడగా మనస్సు స్వస్వరూప మగు ఆత్మయందు విలయమై పోగలదు. అపుడు జీవునకు పరమశాంతి, ఆనందము లభించగలవు. అదియే మోక్షస్థితి.